# శ్రీ శ్రీ

డిసెంబరు 31 1999

# 1+1=1

మొదలైన రేడియో నాటికలు..



# 1+1 = 1 మొదలైన రేడియో నాటికలు

మహాకవి

శ్రీశ్రీ

విశాలాంధ్ర ప్రచురణాలయం

విజయవాడ - 4

3

శ్రీ శ్రీ

# 1+1=1 మొదలైన రేడియో నాటికలు



రు. 3.00 లు

4

## ఇందులో ....

# 5

## చతురస్రం

[“చతురస్రం” నాటిక ఎప్పుడో నేను వ్రాయవలసింది. భగవంతుని గురించీ, మానవుని గురించీ నాకున్న అభిప్రాయాలను ఈ నాటిక ద్వారా కొంతలో కొంతయినా తెలియజేయగలిగానని నే ననుకుంటున్నాను. శ్రీ శ్రీని నిరీశ్వరవాదిగా చిత్రించేవారు కొందరున్నారని నాకు తెలుసు. అలాంటివారినే నేను ముఖ్యంగా ఈ నాటికను శ్రద్ధగా చదవండని కోరుతున్నాను.

నేను మూడుసార్లు మృత్యువును జయించానని సవినయంగా మనవి చేస్తున్నాను. ఆ వివరాలను ఇంకోసారి – బహుశా కావ్యరూపంలో ప్రజల సమక్షంలో పెడతాను. ప్రస్తుతం నేను చెప్పబోయే దేమిటంటే మరణమంటే నాకు భయం లేదనే. ఎప్పటికైనా మానవుడు మరణంమీద విజయం సాధిస్తాడనే నమ్మకం నాకుంది. ఆ నమ్మకమే ఈ నాటికా రచనకు ఆధారం.

“1962 ఫిబ్రవరి నెలలో ప్రళయం వచ్చి మద్రాసు మునిగిపోతుంది కాబట్టి ఆశ్రయం యిస్తాను. ఒక ఆశ్రమానికి రమ్మ”ని ఒక మహర్షి నాకు ఆహ్వానం అందజేస్తే, నే నిచ్చిన జవాబు : “మద్రాసు నగరం మునిగిపోయి ఇక్కడున్న లక్షలాది ప్రజలు చచ్చిపోతే వారితోబాటు నేనూ చస్తానుగాని, ప్రమాదంనించి పారిపోయి బలుసాకు తినను” అన్నాను. అలాగే ఒకప్పుడు

రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో బాంబుల భయంవల్ల ప్రజలంతా మద్రాసునుంచి పారిపోతూ ఉన్నప్పుడు, నేను మాత్రం నా స్థలం వదలలేదు. విశాఖపట్టణంమీద జపాన్‌వారు బాంబులు వేసిననాడు, మద్రాసులో సైరెన్ల మోత మోగినప్పుడు విశాలమైన డాబామీద నేను విశ్రాంతిగా నిద్రపోతున్నాను. ఇదంతా ఇప్పుడు ఎందుకు చెబుతున్నానంటే మరణానికి భయపడే మానవులకు ధైర్యం చెప్పడానికి.

ఇక ఈ "చతురస్రం" గురించి ఒకటి రెండు మాటలు. చతురస్రం అంటే నలుచదరం. ఎ బి సి డి అనే చదరం. ఈ చదరంలో అన్ని బాహువులూ సమానమైనవనే అనుకోకూడదు. అలాగే ఇందులోనూ నలుగురు ముఖ్య పాత్రలూ, కథాకాలం నాటికి వేరు వేరు వయస్సులవారు. అందులో ఏ. జ్ఞానం అనే వైజ్ఞానికుడు. ఆయన వయస్సు 70 ఏళ్లు. బి. రాజ్యం అనే ఆవిడ. ఆమె వయస్సు 50 ఏళ్ళు. సి. కళ అనే అమ్మాయి. ఆ పిల్ల వయస్సు 10 ఏళ్ళు. డి. సిరి అనే కవి. అతని వయస్సు 30 ఏళ్ళు.

కథాకాలం అని కూడా అన్నాను. ఆ కాలం ఏదో మరి చెప్పొద్దూ. ఇది సుమారు ఒక గంటసేపు సాగే నాటకం. కాని కథాక్రమం ప్రకారం ఒక ఉదయంనుంచి మరునాటి ఉదయంవరకు కథ సాగుతుంది. ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం, అర్ధరాత్రి. ఉదయం అని మధ్య మధ్య కవి వచ్చి మీకు కాలాన్ని జ్ఞాపకం చేస్తూ ఉంటాడు. 1999 వ సంవత్సరం డిసెంబరు 31 వ తేదీని ఈ కథ ప్రారంభమవుతుంది. అప్పుడు చంద్రలోకం నుంచి మానవుడు అమృతం తెచ్చాడని ఐక్యరాజ్యసమితికి తెలుస్తుంది. అమృతం పంచిపెడితే మానవులంతా ముప్పయ్యేళ్ళ వాళ్ళయిపోతారు. అప్పటికి మానవ కుటుంబమంతా రాజకీయ స్వాతంత్ర్యమూ, ఆర్థిక స్వాతంత్ర్యమూ అనుభవిస్తూ, మానసిక స్వాతంత్ర్యం సాధించడానికి ప్రయత్నిస్తున్నారు. అమృతాన్ని అందరికీ పంచిపెడితే ఈ స్వాతంత్ర్యం సాధ్యమవుతుంది. కాని సమితిలోనే కొందరు దీనికి అడ్డు చెబుతారు. అయితే ఆనాడు ప్రగతినికోరే దేశాలే ఐక్యరాజ్యసమితిలో అధిక సంఖ్యాకంగా ఉండడంవల్ల, ఆఫ్రో — ఆసియన్ రాజ్యాల తరఫున కాంగో ప్రతినిధి లుముంబా జూనియర్ ప్రతిపాదించిన తీర్మానం నెగ్గుతుంది. ఆలస్యం అమృతం విషం.

తక్షణమే అమృతాన్ని మానవజాతికి పంచిపెట్టాలని ఆఫ్రో – ఆసియన్ తీర్మానం. అది నెగ్గిన అరగంటలో ప్రపంచ మంతటా అమృతాన్ని అఖిల ప్రపంచ ఆరోగ్య శాఖాసంస్థ ప్రజలకు అందజేస్తుంది. మన చతురస్రంలోని నలుగురూ కూడా ముప్పయేళ్ళ వాళ్ళయిపోతారు. 70 ఏళ్ళ జ్ఞానం, 50 ఏళ్ళ రాజ్యం, పదేళ్ళ కళా. ఎటొచ్చీ కవిగారైన సిరిగారు మాత్రం నిన్న 30 ఏళ్ళవాడే, నేడూ 30 ఏళ్ళవాడే.

ఇరవయ్యో శతాబ్దం అంతమవుతుంది. ఇరవై ఒకటో శతాబ్దం ప్రవేశిస్తుంది. ఆ ఉదయాన్ని వర్ణిస్తాడు కవి – తర్వాత ....

ఇలాగ కథంతా నేనే చెప్పేస్తే ఇక మీకు వినేందు కేమీ ఉండదు. కాబట్టి ఇక్కడితో నా ఘోష ఆపుతున్నాను.

ఇక ప్రారంభం దగ్గర ప్రారంభిద్దాం.]

స్త్రీ : ఏదో జరగబోతోంది.
ఏదో జరగబోతోంది.
ఏదో జరగతుం దిప్పుడు.

పురు : ఎవరో వస్తున్నారు.
ఎవరో వస్తున్నారు.
ఎవరో వస్తున్నా రిట్టు....(ఈల)....ష్....

సిరి : నా పేరు సిరి.

స్త్రీ : ఈయ నొక కవి.

పురు : ఇంటిపేరో మరి ?

సిరి : సరి – ఆసిరీ. ఆ సంగతి అలా విసిరీ.
ఇది ఉదయం.
నా హృదయం వయస్సు ముప్పయ్యేళ్లు.
నా మనస్సు వయస్సు ముప్పయ్యేళ్ళు.
నా వయస్సు ఈ ఉదయానికీ సరిగ్గా ముప్పయ్యేళ్ళు.
ఇది ఉదయం.
నిద్రలో కరిగిపోయింది క్రితం రాత్రి.

పక్షులూ, బస్సులూ పంపించేశాయి నిశ్శబ్దాన్ని.
పరుపులకిందకి చెట్లవేళ్ళ సందుకి.
ఆకాశపు అంచుకి.

ప్రపంచం మేలుకొని ఆవలించింది. లేదా ఆవలించి మేలు కొంది. (మీ ఇష్టం ఎలా వీలైతే అలా, ఎలా సులువైతే అలా.... ఇటు మాట అటో అటు మాట ఇటో :)

నిద్రపోయిన (కాదు వచ్చిన) ప్రపంచం నిన్నట్లోంచి నేట్లోకి దూకింది.

సముద్రం లేచింది — అరణ్యం లేచింది.
గ్రామం లేచింది — పట్టణం లేచింది.
నగరం లేచింది — మహానగరం లేచింది.
నదులూ, నదుల్లో చేపలూ.
గనులూ, గనుల్లో నగలూ,
కనులూ, కనుల్లో వగలూ - మేలుకున్నాయి.
నే నింకా నిద్రపోతున్నాను.
నే నింకా నిన్నట్లోనే నాన్తున్నాను.
మసగ్గా ఉంది. విసుగ్గా ఉంది.
అలక : అనుకున్న వేమీ కాకుండాఉన్నాయని,
నిద్రయినా సరిగ్గా రాకుండాఉందని.
నాకు తెలుసు నాకు తెలియకుండా తెల్లవారిందని.
నాకు తెలుసు నాకు తెలిసినవన్నీ నాకు తెలుసునని,

పాలవాడు పాలు తెచ్చాడు.
పేపరువాడు పేపరిచ్చాడు.

* * *

న్యూస్ ఎనౌన్సర్ : అఖిల ప్రపంచ టెలి రేడియో వార్తా సంస్థ. తెలుగులో వార్తలు. చదువుతున్నది.... విశ్వం.

సమయం – 1999 డిసెంబర్ 31 వ తేదీ ...

స్థలం – ఆంధ్రప్రదేశంలో కొత్తగా నిర్మించిన అరవై అంతస్తుల ఐక్యరాజ్య సమితి భవనం.

పండిట్ మన్‌హర్‌లాల్ : ఇవ్వాళ సుదినం హై. మనం ఈ సమావేశం ఇప్పుడు ఇక్కడ చెయ్యడం బహుత్ బహుత్ ముదావహం. ఐ ప్రొపోజ్ మిస్టర్ శ్రీ రావ్ యాజ్ ప్రెసిడెంట్. డిలా కంటూర్స్ దె నసిమోం స్విని.

శ్రీరావ్ : షుక్రియా పండిట్‌జీ.

నేను తెలుగువాణ్ణి.

నన్ను ఈనాటి ఈ సభకి అధ్యక్షుణ్ణిగా ఎన్నుకోవడం నాకూ, నా భాషకీ.... ప్రపంచం చేస్తున్న గౌరవం, మర్సి, మర్సి బకూ

పండిట్ మన్‌హర్‌లాల్ : గుడ్‌మార్నింగ్ డెలిగేట్స్.

ఇప్పుడూ ఐక్యరాజ్యసమితి అధ్యక్షుడూ ప్రపంచ్ పరిస్థితిని పర్యాలో కన్ కరేంగే.

శ్రీరావ్ : థ్యాంక్ యూ మిస్టర్ మనహర్.

ఇవ్వాళతో ఇరవయ్యో శతాబ్దం ముగుస్తుంది. ఒక కొత్త సంవత్సరంలో, ఒక కొత్త శతాబ్దంలో అడుగుపెడుతోంది మానవ జాతి. 150 స్వతంత్ర దేశాలు సమావేశమైన మహాసభ ఇది. ఈ దేశాలన్నింటిలోను ఒక్కొక్క యునైటెడ్ నేషన్స్ భవనం ఉంది. తెలుగువాణ్ణి కాబట్టి తెలుగులో మాట్లాడుతున్నాను. నాకు తెలుసు నా ప్రసంగం ఈ క్షణంలో ప్రపంచపు నలభై నాలుగు ప్రధాన భాషల్లోకి పరివర్తనం చెందుతోందని.

ఐ సెల్యూట్ మై ఆఫ్రికన్ కామ్రేడ్స్

ఐ సెల్యూట్ మై ల్యాటిన్ అమెరికన్ కామ్రేడ్స్

ఐ సెల్యూట్ ఆల్ మాన్‌కైండ్.

ఈ దినం ప్రపంచంలో ఎక్కడా అస్వతంత్రరాజ్యం లేదు. కాని ఒక పాతికేళ్ల వెనక్కి తిరిగి చూడండి. చరిత్ర మీకు తెలుసు. వలస రాజ్యాలవాళ్లు, కలవాళ్ళు వాళ్ళు ఎన్ని వలలు పన్ని, ఎన్ని విధాలుగా తమ విధానాన్ని కొనసాగించుకోవాలనుకున్నారో. కాని మేలు కున్న మానవజాతి ముందడుగు వేసింది. వలస విధానం నశించింది. మనిషి రాజకీయంగా స్వతంత్రు డయ్యాడు. అది పాతికేళ్ళ కిందట. ఆ మీదట —

ఐక్యరాజ్యసమితి యుద్ధాన్ని బహిష్కరించింది.

థ్యాంక్స్ టు యు. ఎస్. ఎస్. ఆర్.

థ్యాంక్స్ టు యు. ఎస్. ఏ.

థ్యాంక్స్ టు ఎవ్వెరిబడీ ఎవ్వెరిహ్వేర్.

యుద్ధ రాక్షసికి అహింసాయుతంగా అంత్యక్రియలు జరిగాయి.

మానవ జాతి ఒకే కుటుంబం

అన్న మాటకి ప్రాణం వచ్చింది.

హియర్, హియర్, హియర్. (చప్పట్లు)

శ్రీరామ్ : ఫ్రెండ్స్.... రాజకీయ స్వాతంత్ర్యం సాధించిన మానవుడు ఆర్థిక స్వాంతత్ర్యంకోసం పోరాటం సాగించాడు. మళ్ళీ ఎన్నో ఆటంకాలు. మళ్ళీ ఎన్నో అవాంతరాలు. కలవాళ్ళనీ. లేనివాళ్ళనీ వ్యత్యాసాలు లేకపోతే, లేనివాళ్ళకి లేనివాళ్లు, కానివాళ్ళు దయాధర్మ భిక్షగా, సహాయ్య సానుభూతి సహకారాలగా చూపించడం పోతుంది. అందువల్ల మానవుల్లోని మానవత్వం నశిస్తుంది అనే ఒక వింత వాదం వితండవాదం బయలుదేరింది. మళ్ళీ యుద్ధరాక్షసికి ఈ సమస్య ఆధారంగా ప్రాణప్రతిష్ఠ జరిగే ప్రమాదం లోకాన్ని ఎదుర్కొంది. ప్రశాంతంగా శాస్త్రీయ విజ్ఞాన పరిశోధనలు సాగిస్తున్నవారు. వివిధ కళలలో విశేష విజయాలు సాధిస్తున్న కళాకారులు, విద్యావేత్తలు మొదలైన మేధావులంతా, ఈ మన ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యం క్రింద ప్రపంచం అంతటికీ....ఆర్థిక స్వాతంత్ర్యం సాధించారు. యుద్ధ ప్రయత్నాలక్రింద ఖర్చుపెడుతున్న కోటానుకోట్ల ధనం.

మానవుని ఆరోగ్యానికీ, విద్యకీ, ఆనందమయ జీవితానికీ వినియోగమవుతున్న స్థితిలో ఇప్పుడు మనం ఉన్నాము.
కాని...
రాజకీయ స్వాతంత్ర్యం వచ్చినా....
ఆర్థిక స్వాతంత్ర్యం వచ్చినా ..
మానవజాతి కింకా మానసిక స్వాతంత్ర్యం ఏర్పడలేదు.
మన ఆలోచన లింకా అరాజకదశలోనే ఉన్నవి.
అరణ్యాలు మన మనస్సులు.
అగాధాలు అజ్ఞేయాలు మన మనోలోకపు భావనా విధానాలు.
మానసిక స్వాతంత్ర్యం సాధించడమే ఈనాటి మానవ సమస్య.

* * *

కవి : మధ్యాహ్నం అయింది. వెలిగేట్లు లంచికి పోయాయి. కథలన్నీ కంచికి పోయాయి. ఎంత వింతగా ఉంది ఈ మధ్యాహ్నం. ఎంత హాయిగా ఉంది నా హృదయం. ఎంత నిర్మలంగా ఉంది నా మనస్సు. ఈర్ష్యల్లేని, ద్వేషాలు లేని ఈ మానవజాతిని ఎంతగా ప్రేమిస్తున్నాను నేను.
ప్రేమ....ప్రేమ....ప్రేమ....

కళ : మామా....మామా....మామా....

సిరి : కళా, కళా, కళా....
ఎందుకొచ్చా విలా — స్కూలు లేదా ?

కళ : పరీక్షలు కాదూ ? అంచేత మధ్యాహ్నం సెలవు.

సిరి : జాగ్రత్త. పడగలవు. ఏవి టా గంతులు.

కళ : నిన్న లెక్కల పరీక్షలో నాకు ఫస్టు మార్కొచ్చింది మామయ్యా.

సిరి : అందుకా ఆ చిందులు. మ రివాళ ?

కళ : చరిత్ర. ప్రపంచ చరిత్ర.

సిరి : సరిగ్గా రాశావా ?

కళ : రాశాను. కానీ....

సిరి : కాని ?

కళ : ఫస్టుమార్కు రాదేమో ?

సిరి : కళకి ప్రపంచ చరిత్రలో ఫస్టుమార్కు రాకపోవడం కవికే కళంకం.

కళ ; ఇవాళ నా పుట్టినరోజు మావయ్యా.

సిరి : శుభం.

కళ : పదేళ్ళువెళ్ళి పదకొండోయేడొచ్చింది నాకు.

సిరి : సంతోషం.

కళ : మామా....ఇవాళ మన ఊళ్ళో ఐక్యరాజ్యసమితి సమావేశం కదూ....

సిరి : అవును.

కళ : గొప్ప గొప్పవాళ్ళంతా వస్తారు కదూ ?

సిరి : వచ్చారు.

* * *

ఎనౌన్సర్ : ఐక్యరాజ్యసమితి భవనంలో పదో అంతస్తులో భద్రతామండలి రహస్య సమావేశం జరుగుతోంది. సింహళ ప్రతినిధి శ్రీమతి సిగిరియా యీ సభకు అధ్యక్షత వహించారు.

సిలన్ : మిత్రులారా ! చంద్రమండలానికి వెళ్ళిన మన వైజ్ఞానిక బృందం ఇప్పుడే ఒక రిపోర్టు పంపింది. దాని ప్రతులు మీముందర ఉన్నాయి. చంద్రమండలం చేరగానే వారిలో వచ్చిన మార్పులన్నీ వివరిస్తూ ఒక రహస్య నివేదికను. వెళ్లిన యాభై మంది వైజ్ఞానికుల తరఫునా వారి నాయకుడు మనకు పంపించాడు. బయలుదేరినప్పుడు వారి వయస్సులు వేరు వేరు. సుధానిధి అయిన చంద్రునిలోని అమృతం వల్ల వెళ్ళినవారంతా ముప్ఫయేళ్ళవారయిపోయారు. అనగా త్రిదశులయ్యారన్నమాట. మానవులు దేవతలుగా మారగల అవకాశం ఇప్పుడు లభించింది. ఈ సాయంత్రమే వైజ్ఞానిక బృందం న్యూఢిల్లీలో దిగుతుంది. మానవజాతి అంతకీ సరిపోయే అమృతం వారు తీసుకొని వస్తున్నారు. ప్రపంచ ఆరోగ్య సంస్థ ద్వారా పరస్ప

హెల్త్ ఆర్గనైజేషన్ ద్వారా ఈ అమృతాన్ని అరగంటలో అన్ని ప్రాంతాలవారికీ అందజేయవచ్చును. భద్రతామండలి యీ విషయమై నిర్ణయం చేయవలసియున్నది. ఇందులో రాజకీయా లేవీ లేవు. అమృతం పంచిపెట్టాలా వద్దా, లేక వెంటనే పంచిపెట్టాలా, కొన్నాళ్ళవాకా ఆగాలా అన్నదే ఇప్పుడు మన ముందువున్న సమస్య. దీన్నిగురించి మొట్టమొదట బ్రిటిష్ ప్రతినిధి సర్ జాన్ హైమన్ ప్రసంగిస్తారు.

*　　*　　*

హైమన్ : థ్యాంక్స్ మేడమ్ ప్రెసిడెంట్.

అమృతం పంచిపెట్టాలా వద్దా అనే విషయమై రెండు అభిప్రాయాలెప్పుడూ ఉండవు. ఇప్పుడూ లేవు. అయితే అకస్మాత్తుగా, తక్షణమే పంచవలసిన అవసరం ఏం వచ్చిందని నే నడుగుతున్నాను. మానవులంతా ముప్పయేళ్ళవాళ్ళయిపోయినంత మాత్రంచేత, వాళ్ళ మనస్సులు, వాళ్ళ ఆలోచనలూ ముప్పయేళ్ళవాళ్ళవే అవుతాయనుకోవడం పొరపాటు. ఈనాడు చంటిపిల్లలు మొదలు చనిపోవటానికి సిద్ధంగా ఉన్న వృద్ధులవరకూ ఎన్నో వయోవ్యత్యాసాలను ప్రదర్శిస్తోంది మానవ జాతి. ఒక్క మందుతో ఈ ఎగుడు దిగుడులన్నీ సర్దుకొని చదునయిపోతాయా? ఈ విషయమై ఈ సభకు వచ్చేముందుగా మా బ్రిటిష్ వైజ్ఞానిక నిపుణులతో బంచి ేబులు వద్ద ఆషామాషిగా చర్చించాను. అందరూ ఇంచుమించు ఒకే అభిప్రాయాన్ని ప్రకటించారు: మందు తీసికొన్న మరుక్షణమే మనుష్యుల - మనస్సులు మారిపోవని. మానవజాతి, మానసిక స్వాతంత్ర్యం సాధించాలంటే కొంత కృషి, కొంత ప్రచారమూ, కొంత ప్రయత్నమూ అవసరం. ముందుగా మనం మానవులను మానసిక స్వాతంత్ర్యానికి సంసిద్ధుల్ని చెయ్యాలి. తర్వాత మందివ్వాలి. అందుచేత ఒక పది సంవత్సరాలదాకా, లేదా కనీసం ఇదు సంవత్సరాలదాకా ఈ అమృతం సమస్యకి వాయిదా వెయ్యాలని కోరుతున్నాను.

భా. ప్ర : అడ్డువచ్చినందుకు క్షమించాలి. మాడమ్ ప్రెసిడెంట్, మీ అనుజ్ఞతో....

సిలన్ : ఎవరు ? భారత ప్రతినిధిగారా ! మాట్లాడవచ్చు.

భా. ప్ర : ఇరవయ్యో శతాబ్దం అంతం కావస్తున్నా, ఇరవయ్యో శతాబ్దపు ప్రారంభంలో ఆడినలాంటి మాటలే ఆడుతున్నాడు మన బ్రిటీషు మిత్రుడు. ఇప్పటికీ ఈ బ్రిటీషువారి మనస్తత్వం ప్రగతి నిరోధక భావాలనే ప్రసరిస్తున్నదని చెప్పడానికి చింతిస్తున్నాను. ఎప్పుడూ సమస్యలను వాయిదా వెయ్యడం. జాప్యంచెయ్యడం తప్ప, సూటిగా ఎదుర్కొని సులువుగా పరిష్కరించడం కనబడదు. ఆనాడు ఇండియా స్వాతంత్ర్యానికి కూడా ఇలాగే వాయిదాలు వేశారు. మొదటి ప్రపంచయుద్ధం ముగిసినవెంటనే భారతీయులకు స్వేచ్ఛ లభించి ఉండవలసింది—కాని అలా జరుగలేదు. తర్వాత పాతికేళ్ళకు పైగా గాంధిమహాత్ముని నాయకత్వంక్రింద భారతీయులు అహింసా యుతంగా గొప్పపోరాటాలు సాగించినమీదట కదా మేం స్వతంత్రుల మయ్యాము. విప్లవాలతోను, రక్తపాతాలతోను ఇతర దేశాలకు స్వాతంత్ర్యం సిద్ధిస్తే, ఒక్క భారతదేశమే అహింసాయుతంగా, రక్తపాత రహితంగా....

హైమన్ : పొరపాటు. రక్తపాతం లేకుండా స్వరాజ్యం సంపాదించామని మన మిత్రుడు భారత ప్రతినిధి యీనాడు ప్రచారం చేసుకోవచ్చు. నా అభ్యంతరం లేదు. కాని చరిత్ర ఇస్తున్న సాక్ష్యం మాటేమిటి ? ఇండియాకు స్వాతంత్ర్యం రాకముందూ, వచ్చిన తర్వాత ఎన్ని లక్షలమంది హిందువులూ, ముస్లిములూ మరణించలేదు. స్వరాజ్య ప్రదానానంతరం మీ గాంధిమహాత్ముని రక్తాన్నే ఒక మతదురహం కారి మీ రాజధానినగరంలో చిందించాడే.

భా. ప్ర : ఐ అబ్జెక్ట్ మాడమ్ ప్రెసిడెంట్, స్వరాజ్య ప్రదానం అన్నమాటకి నేను అసమ్మతి తెలుపుతున్నాను. స్వరాజ్యం మా కెవరూ దానంగా ఇవ్వలేదు.

హైమన్ : అయితే నా మిత్రుడు భారతప్రతినిధికి అసలు రహస్యం తెలియ

దన్నమాట. ఇండియాకి స్వాతంత్ర్యం అహింసా యుద్ధాలవల్ల రాలేదు. స్టాలిన్‌గ్రాడ్‌లో రష్యా గెలువడంవల్ల రాలేదు. నేతాజీ సుభాస్‌చంద్రబోస్ సేనలు నిర్మించడంవల్ల రాలేదు.

భా. ప్ర : అయితే మరెలా వచ్చిందంటారో అన్నీ తెలిసిన మన బ్రిటిష్ మిత్రుడు ?

హైమన్ : అన్నీ తెలిసినవాణ్ణిగా అభినయించడం లేదు నేను. ఇండియాకు స్వాతంత్ర్యం ఎలా వచ్చిందో నాకు తెలుసు. బ్రిటిష్ రాజ కుటుంబమే ఇండియాకు స్వాతంత్ర్యం ఇచ్చింది. ఆ నాడు ఆరవ జార్జి చక్రవర్తికి ఎలిజబెత్ యువరాణి ఇచ్చిన సలహా వల్లనే ఇండియా స్వతంత్ర్యరాజ్య మయింది. దీనికి సంబంధించిన రహస్య పత్రాలు బకింగ్‌హాం భవనపు పాత రికార్డుల గదిలో వున్నాయి.

భా. ప్ర : ఆ రహస్య పత్రా లేవో మేం చూడగల అవకాశం ఉందా ?

హైమన్ : అందరూ చూసే అవకాశం ఉంటే, అవి రహస్యపత్రా లెలా అవుతాయి.

భా. ప్ర : నాకు తెలిసినమట్టుకు బ్రిటన్‌లో పార్లమెంటు నిర్ణయాలు చేస్తుందనీ. లాంఛనప్రాయంగా దానికి రాజముద్ర లభిస్తుందనీ అనుకుంటున్నానే.

హైమన్ : బ్రిటిష్ పార్లమెంటు గురించి మాకన్న తనకే ఎక్కువ తెలుసుననుకొంటూన్న మన భారతీయ మిత్రుణ్ణి. నేను అభినందించకుండా ఉండలేకపోతున్నాను.

భా. ప్ర : మీ అభినందనలోని ఆంతర్యానికి నేను ఆనందిస్తున్నాను.

సిలన్ : ఆర్డర్. ఆర్డర్. ఫ్రెండ్స్....మనం అసలు విషయం మరచిపోయి, అనేక దశాబ్దాలనాటి సంగతులు చర్చిస్తున్నాం. నేను మొదటే చెప్పాను. ఈనాడు యీ సభ రాజకీయాలకి చర్చావేదిక కాదని. మన ముందున్న సమస్య విషయమే మాట్లాడుకుందాం. సర్ జాన్ మీ రింకా ప్రసంగించదలచుకున్నారా ?

హైమన్ : నో మేడమ్. నేను చెప్పవలసిం దేదో చెప్పేశాను.

సిలన్ : ఇప్పుడు అమెరికా ప్రతినిధి మిస్టర్ శాంశ్వాన్ మాట్లాడుతారు.

శాంక్వన్ : నాది ప్రజాస్వామ్య దృక్పథం. మెజారిటీ అభిప్రాయాన్నే ఆమోదిస్తాను. కాని నా వోటు మాత్రం బ్రిటిష్ ప్రతినిధి అభిప్రాయానికే.

సిలన్ : కాంగో ప్రతినిధి శ్రీ లుముంబా జూనియర్.

లు. జూ. : ఆలస్యం అమృతం విషం. ఆలస్యం చేయకుండా అమృతాన్ని పంచిపెట్టాలి, అంతే.

రష్యా : వెల్ సెడ్. వెల్ సెడ్.

సిలన్ : ఎవరది, సోవియట్ ప్రతినిధిగారా ? మైక్ దగ్గరకివచ్చి మాట్లాడవచ్చునే.

రష్యా : నా సమయం వచ్చినప్పుడు నేను మాట్లాడుతాను.

సిలన్ : సరే. ఇప్పుడు ఫిలిప్పీన్స్ ప్రతినిధి డూడూడూగారు మాట్లాడుతారు.

ఫిలిప్పీన్ : కాంగో ప్రతినిధి సుక్తసరిగా మూడు మాటల్లో సమస్యని పరిష్కరించి వేశాడు. కాని యిది అనుకున్నంత సుళువుగా అయే పనికాదు. నాగరికతలో వెనుకబడిన దేశాలకు స్వతంత్ర రాజ్యాలతో సమాన ప్రపత్తి ఇస్తే ఇలాటి అనర్థాలే తటస్థిస్తాయి.

లు : కాంగో వెనుకబడిన దేశం కాదు. అన్ని రంగాలలోను పురోగమిస్తున్న శ్రేయోరాజ్యం అది.

ఫిలిప్పీన్స్ : అని మీరు అనుకుంటున్నారు. నిజంగా ఎంతవరకు పురోగమించారు. ఇప్పటికీ మీ కాంగోలో నరమాంసం భుజించే వాళ్ళున్నారు.

లు : ఐ అబ్జెక్టు మాడమ్ ప్రెసిడెంట్. ఇది మా దేశపు ఆంతరంగిక వ్యవహారాల్లో ప్రత్యక్ష జోక్యం. ఎవరో కొందరు పాత సంప్రదాయాలను వదలుకోలేని ఛాందసులు ఏడాది కొకమారు విందులో నరమాంసం-అదైనా కొద్దిగా తీసుకుంటారు. ఘోరమైన ఈ ఆచారాన్ని ఆఫ్రికా ఖండమంతా అసహ్యించుకుంటోంది. నియంతృత్వ ధోరణితో నరమాంస భక్షణని నిషేధించడం సులభమే. కాని త్వరలోనే యీ దురాచారం తనంత తానే నశించిపోతుంది.

ఫిలిప్పీన్స్ : కాని, ఈలోగా నరమాంస భక్షకుల నాగరికతను ఒకందుకు అభినందించవలసిందే. తింటున్నది నరమాంసమైనా నైపుణ్యా, ఫోర్కు, బా ఉపయోగిస్తున్నారు.

సిలన్ : ఆర్డర్. ఆర్డర్. మళ్ళీ విషయానికి దూరమవుతున్నాం. ప్రస్తుత సమస్యమీద మాట్లాడాలని ఫిలిప్పీన్స్ ప్రతినిధిగారిని కోరుతున్నాను.

ఫిలిప్పీన్స్ : వాయిదా. వాయిదా. అమృతం పంచిపెట్టడానికి ఆరునెలలు వాయిదా.

సిలన్ : ఇప్పుడు సోవియట్ ప్రతినిధి ప్రొఫెసర్ న్యాయకోవస్కీగారు మాట్లాడుతారు.

రష్యా : పసీబా మాడమ్ ప్రెసిడెంట్. దోస్తులారా, నేస్తులారా. ప్రపంచ చరిత్రలో ఒక ప్రధాన సంఘటన జరగబోతున్న సమయంలో మనం సమావేశం అవుతున్నాం. మానవజాతి మరణాన్ని జయించే కాలం సన్నిహిత భావిలోనే ఉంది. చంద్రమండలానికి వెళ్ళిన వైజ్ఞానికులలో చాలామంది రష్యా వారే. అంతమాత్రంచేత మేము గర్వం ప్రకటించేది లేదు. ఈ విజయం మానవజాతి సమష్టి విజయం అని అందరూ భావించాలి. అందుచేత అమృతాన్ని అందరికీ సమానంగా పంచిపెట్టాలి. ఇది ఎంత శీఘ్రం జరిగితే అంత మంచిది. నేటితో యిరవయ్యో శతాబ్దం అంతమవుతోంది. మానవులు మరో శతాబ్దంలో ప్రవేశిస్తున్నారు. మన మిత్రుడు బ్రిటీష్ ప్రతినిధి చెప్పినట్లు మన మనోభావాలలో ఎన్నో ఎగుడు దిగుడులూ, వ్యత్యాసాలూ ఉన్నమాట నిజమే. కాని యిది యీనాటి నిజం. ఈ వ్యత్యాసాలన్నీ ఇలాగే ఉంటాయా రేపు కూడా ? ఈ సభనే చూడండి. ఒక్కొక్క మహా దేశానికి ప్రాతినిధ్యం వహిస్తున్న ఒక్కొక్క ప్రముఖ వ్యక్తితోసహా ఎంతెంత జాతి విద్వేషం ఎన్నెన్ని పాతభావాలూ ప్రదర్శించబడ్డాయో ! వీటిని ప్రయత్నించి పారదోలాలి. అందుకే అమృత సేవనం మొదటి మెట్టు. సృష్టి సమానాంతర రేఖలలో ప్రవహిస్తోందని నేటి వైజ్ఞానికులలో కొంద

రంటున్నారు. ఇది ఐన్‌స్టీన్ సిద్ధాంతానికి విరుద్ధమని కొందరంటు న్నారు. ఇంకా ఖగోళాలకు సంబంధించిన భోగట్టా మరి కొంత తెలిసేదాకా దీని విషయం యిదమిత్థమని నిర్ణయింపలేము. కాని ఒకటి నిశ్చయమనే చెప్పవచ్చును. మానవ మనస్సులో అనేక చతురస్రాలున్నాయి. రెండేసి రెండేసి సమాంతరరేఖలు నిలువుగా ప్రవహిస్తున్నా యనుకోండి. అప్పుడు వాటిమధ్య ఎన్నో చతురస్రాలు ఏర్పడతాయికదా. అయితే ఇవి స్క్వేరులా రెక్టాంగిల్సా? సమబాహు చతురస్రాలా? విషమబాహు చతురస్రాలా? ఈ చతురస్రాల సమస్యలను పరిష్కరించడానికి కూడా ప్రజ లందరికీ అమృతాన్ని పంచిపెట్ట వలసిందే, ప్రస్తుత ప్రపంచ స్థితిలో ఇవి రెక్టాంగిల్స్ అనే నే ననుకుంటున్నాను. ప్రవహిస్తున్న అడ్డు నిలువు సమాంతర రేఖలుగా కాలాన్ని నేను భావిస్తున్నాను. మానవుడు టైమ్‌ని స్క్వేర్ చెయ్యాలి. ఆఖరిమాట. భద్రతా మండలిలో కూడా యీనాడు ప్రగతిశీల రాజ్యాలదే మెజారిటీ. మా ప్రతిపాదనలను బ్రిటన్‌గాని, అమెరికాగాని వీటో చెయ్యడం ఎప్పుడో మానేశాయి. అది వారి ప్రజాస్వామ్య దృక్పథానికి నిదర్శనం. అందుకు వారిని అభినందిస్తున్నాను. కాని మానవజాతి భవిష్యత్తునే తీర్చిదిద్ద గల ఈ మహత్తర విషయాన్ని జనరల్ అసెంబ్లీలోనే-బహిరంగ చర్చలోనే వోటుకు పెట్టాలని నేను సూచిస్తున్నాను.

(కరతాళ ధ్వనులు)

సిలన్ : సాయంత్ర మయింది. ఈ సభను వాయిదా వేస్తున్నారు.

* * *

కవి : సాయంకాల మయింది.

కండలు తిరిగిన సాయంత్రం చండప్రచండంగా గర్జిస్తోంది.
కండలు తిరిగిన సాయంత్రం కష్టాన్నీ సుఖాన్నీ మోస్తోంది కావడి
కుండల్లాగ.
కండలు తిరిగిన సాయంత్రం కవిత్వం మాట్లాడుతోంది.
గడ్డంమాసిన సాయంత్రం గాడిదకూత కూస్తోంది.

గడ్డంమాసిన సాయంత్రం కథలని దొంగిలిస్తోంది.
గడ్డంమాసిన సాయంత్రం గాగరా ధరించి తిరుగుతోంది.
కొమ్ములు తిరిగిన సాయంత్రం కొమ్ములువిరిచి నిలబడింది.
కొమ్ములు తిరిగిన సాయంత్రం కోటలుదాటే మాట చాటుతోంది.
కొమ్ములు తిరిగిన సాయంత్రం కోటికి పడిగావెత్తుతోంది.

జ్ఞానం : నడిసముద్రంలో సాయంత్రం గుడిలో దీక్షాలు తీస్తోంది. ఇలాంటి కవిత్వం ఈజీ. ఎవరైనా చెప్పగలరు.

సిరి : పగలయా, గురూ, ఇలా వేంచాంచేరేం ఎద్దనేవేళ.

జ్ఞా : వేళాకోళాలేల.

సింపి : కూర్చోండి తాతయ్యా.

జ్ఞా : కూర్చోడానికి వేళలేదు.

సి : అయితే నిలబడే మాట్లాడండి. కాని జ్ఞానంగారి ఎదుట కవిగారు కూర్చొని మాట్లాడకూడదు నేనూ నిలబడతాను.

జ్ఞా : నిలబడు. దృఢంగా నిలబడు. సిద్ధంగా నిలబడు.
ఒరే సిరా !

సిరి : సిరా కాదు సిరి.

జ్ఞా : సారీ. సిరి ఇవాళ నాకో అనుమానం.

సిరి : ఏమిటది.

జ్ఞా : మానవుడు జరామరణాలని జయిస్తాడు.

సిరి : కవులు తమ కవిత్వంలో అదే ఆనాటినుంచీ అన్నారు.

జ్ఞా : కాని ఈనాడు అది సాధ్యం.

సిరి : ఏం. మీకేదైనా రహస్య వర్తమానం తెలిసిందా ?

జ్ఞా : నేను వైజ్ఞానికుణ్ణి. ఆధారం లేనిదాన్ని నేను నమ్మను తెలుసా ?

కవి : నేను కవిని. ఆధారంలేందే ఆకాశంలో విహరించేవాణ్ణి.

జ్ఞా : ఏమిటి నీ అన్వేషణ ?

సిరి : అమృతం.

జ్ఞా : అంటే ?

కవి : మానవుడికి మరణం లేకుండాచేసే మందు. అది చంద్రుడిలో కంది.

జ్ఞా : నిజమా ? కవిత్వమా ?

కవి : నిజమే. కవిత్వమే. ఇవాళ మానవుడు అమరుడు కాబోతున్నాడు.

జ్ఞా : కవీ, నువ్వన్నమాట నిజం. నిజంగానే ఇవాళ న్యూఢిల్లీలో చంద్రలోకానికి వెళ్ళిన డెలిగేట్లంతా అమృతంతోసహా దిగారు. మా ఆఫీసుకి అధికారవార్త అందింది.

సిరి : ఆ. అయితే నా గెస్సు రైటే.

జ్ఞా : అవునయ్యా కవీ. అందుకే అంటారు కరెక్టుగా గెస్ చెయ్యడమే కవిత్వం అని.

సిరి : కాని జ్ఞానం తాతయ్యా, నాకో అనుమానం. ఈ రాజకీయవేత్తలంతా కలిసి వారిలోవారు కొట్లాడుకొని మానవజాతికి అమృతం అందకుండా చేస్తారేమో.

జ్ఞా : ఇదే ఇవాళ ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీలో చర్చిస్తున్నారు. రేడియో పెట్టు. విందాం.

* * *

ఎనౌన్సర్ : ఐక్యరాజ్యసమితి సర్వసభ్యసమావేశంలో తక్షణమే అమృతాన్ని మానవులకు పంచాలన్న ఆఫ్రో-ఆషియన్ తీర్మానం నెగ్గింది. 150 మంది ప్రతినిధులలో నూరుగురు అనుకూలం గాను, 30 మంది వ్యతిరేకం గాను ఓటుచేశారు. ఇరవై రాజ్యాలు తటస్థంగా వుండిపోయాయి. ప్రపంచం అంతటా రాత్రి పన్నెండు గంటలకి వరల్డ్ హెల్తు ఆర్గనైజేషన్‌వారు ఇంజెక్షన్ల ద్వారాగాని, మాత్రలద్వారాగాని మానవులకు అమృతాన్ని ఇస్తారు.

* * *

జ్ఞా : ఏం? రేడియో ఆపేశారేం? ఇంకా విందాం.

కవి : ఇక వినడాని కేముంది? మానవుడు మరణాన్ని జయించాడు. నాకు మహదానందంగా ఉంది తాతయ్యా. ఆనాటినుంచి మనిషి కన్న కలలు నేటికి ఫలించాయి.

జ్ఞా : అబ్బ, నీ గోల నీది. అమృతం సేవిస్తే, అంతమందీ ముప్ఫయేళ్ళ వాళ్ళవుతారని మా కార్యాలయంలో లెక్కవేశారు. ఆ వివరంకూడా రేడియోలో చెబుతారేమో అని చూశాను.

కవి : పోనీండి. మీ సెక్రటరీకి ఫోను చెయ్యండి.

జ్ఞా : అవును. బాగా చెప్పావు. (ఫోనుతీసి డయల్ చేస్తాడు). రాజ్యం? అవును. అబ్బ, ఎప్పుడూ పెళ్ళిసంగతేనా? అవును. ప్రామిస్ చేశాను నిజమే. రేపేనా...అంత వ్యవధిలేకుండానా? సరే నీ యిష్టమే కానీ, అవును. నీయిష్టమే కానీ.... అవును ప్రామిస్ చేశాను. ఖరారుగా, రేపు ఉదయం పెళ్లాం, కాని – రాజ్యం, అమృతం సంగతి తెలిసిందా? అబ్బ. ఏమిటలా కసిరావ్? ఆ....ఆ.... సరే. రా.

సిరి : ఏవిటి తాతయ్యా?

జ్ఞా : రాజ్యం యిక్కడికి వస్తానంటోంది.

సిరి : రానీండి, అమృతం విషయం ఏమంటుంది?

జ్ఞా : ఏవీ తెలియదట. రాజ్యానికి ఈ అమృతం విషయంలోకాదు – అమృతం విషయంలో ఏమీ నమ్మకం లేదు. ఐక్యరాజ్యసమితిలో దీన్ని చర్చిస్తున్నారన్నా ఆ పోనిద్దురూ అంటుంది.

సిరి : సరేగాని తాతయ్యా. రాజ్యంగారిని పెళ్ళి చేసుకుంటావా?

జ్ఞా : అవునురా సిరీ. తప్పేటట్టులేదు. మాట కూడా ఇచ్చేశాను.

సిరి : ఇప్పుడు మీకు పెళ్ళేమిటి తాతయ్యా. ఆవిడికి యాభై ఏళ్ళా, నీకు డెబ్బయ్యేళ్ళా.

జ్ఞా : అర్థరాత్రి అయ్యేసరికి మనం అందరం ముప్ఫయ్యేళ్ళవాళ్ళం అయి

పోతున్నాంకదూ. అవాలి మరి మా లెక్కల ప్రకారం. సిరీ ఇప్పుడు టైమెంతయింది.

(12 గంటలు కొట్టిన చప్పుడు)

సిరి : అర్ధరాత్రి అయింది.
ఇరవయ్యో శతాబ్దపు చివరి రాత్రి ఇది ఇంకా మేలుకొనే ఉన్నానేను.

జ్ఞా : పాడు. కానీ నీ కవిత్వం! అర్థంలేని అర్ధరాత్రి అమృతం పంచిపెడుతోంది. గాత్రంలేని రాత్రం నేడు మౌనంగా గానం చేస్తోంది.

సిరి : ఏమిటి తాతయ్యోవ్. కవిత్వం చెప్పేస్తున్నావ్.

జ్ఞా : అవును రా. నీ మొగంచూస్తే దానంతట అదే కవిత్వం వచ్చేస్తోంది. చచ్చాను.

సి : ఏమిటది?

జ్ఞా : రాజ్యరి వచ్చేస్తోందిట.

సిరి : అయితే అంత హడలెందుకూ ?

జ్ఞా : వెళ్ళని ప్రాణాలు తీస్తుంది - ప్రమాణం కూడా చేయించుకుంది.

సిరి : అయితే పెళ్ళాడు. దానికింత ఆలోచ నెందుకు.
రండి రాజ్యంగారూ.

రాజ్యం : మా ముసలాయన్ని చూదామని వచ్చాను. కవిగారూ, మీకు తెలుసునా నేను తెల్లారగానే శ్రీమాన్ జ్ఞానంగారిని పెళ్ళిచేసుకుంటున్నాను.

కవి : వింటున్నాను.

జ్ఞానం: రాజ్యం, నామాట విను. తలచినప్పుడే తాతకి పెళ్ళేమిటి ? నెల్లాళ్ళాగ కూడదూ ?

రాజ్యం : నెల్లాళ్ళా. నిమిషమైనా ఆగను. ఎందు కాగాలి. అర్థ రాత్రయి పోయింది గాని లేకపోతే ఇప్పుడే రిజిష్టరాఫీసుకి ఈడ్చుకుపోయుందును మిమ్మల్ని.

జ్ఞానం : అమృతం సంగతి నిజమే. ఇవాళే ఎనౌన్స్‌మెంట్ వచ్చింది.

రాజ్యం: ఆ. ఎవరు నమ్ముతారండీ ఈ గాలికబుర్లు. మనకి అమృతం దొరికే దేమిటి. మళ్ళీ యౌవనం వచ్చేదేమిటి.

జ్ఞానం: చెప్పాను కాదూ సిరీ. రాజ్యాని కీ విషయంలో ఏమీ నమ్మకం లేదు. రాజ్యం, మనం తప్పకుండా అమృతం పుచ్చుకుంటాం. ఈసరికి డబ్ల్యు. హెచ్. ఓ. డాక్టర్లిక్కడికి వచ్చేస్తూనే ఉంటారు. నీకు ఇంజెక్షన్ కావాలా? మాత్ర కావాలా?

రాజ్యం: అవును గ్లాసులో నీళ్ళు పోసుకుని మాత్ర కరిగించి మందులాగ తాగేస్తాను. తక్షణం చచ్చిపోతాను.

జ్ఞానం: కాదు బతుకుతావు రాజ్యం.

రా: లేదు. మీరు పెళ్ళాడనంటే నిజంగానే చచ్చిపోతాను.

జ్ఞా: పెళ్ళాడనని నే నన్నానా? కాకపోతే కాసిన్ని రోజు లాగమన్నాను.

రా: అవ్వ పేరే మురలమ్మ.

జ్ఞా: అడుగడుక్కీ మన వయస్సులు జ్ఞాపకం చెయ్యకు రాజ్యం.

రా: మనస్సుకి వయస్సేమిటి. మనది మనసులు కలిసిన ప్రేమని మీరేగా అన్నారు.

జ్ఞా: అన్నాను.

రా: ఎన్ని మార్లన్నారు.

జ్ఞా: 29 లక్షల మున్పైతొమ్మిదివేల నలభై తొమ్మిదివందల యాభై తొమ్మిది మార్లని అన్నట్టు నా జ్ఞాపకం.

రా: మనది చాలా పవిత్రమైన ప్రేమని అన్నారు కాదూ మీరు.

జ్ఞా: అన్నాను.

రా: ఇది దేహానికి సంబంధించినది కాదనీ, ఆధ్యాత్మిక ప్రేమ అని అన్నారు కాదూ మీరు.

జ్ఞా: అన్నాను.

సిరి: వృద్ధాప్యం మీదపడ్డాక ఆధ్యాత్మిక ప్రేమ కాకపోతే—

జ్ఞా: అదిగో, ఆ మాటే అనొద్దన్నాను. అమృతం సేవించబోతున్నాం మనం.

రా : ఆఁ. గొప్ప సంబరం. ఆయనగారి మాటలు నమ్మకు బాబూ! అదంతా ఒక పిచ్చి.

సిరి : ఫ్రెయిల్ టీ దై నేమ్ ఈజ్ వుమన్ అన్నాడు షేక్స్‌పియర్ అనాడు. ప్రేయసీ! నీ పేరు రాక్షసి అన్నాడు శ్రీ శ్రీ యీనాడు.

జ్ఞా : నేను బయాలజిస్టుని ఫిజియాలజిస్టుని, సైకాలజిస్టుని.

రా : జిష్ణుని, విష్ణుని, కృష్ణుని,

కవి : వర్ధిష్ణుని, రోచిష్ణుని.

జ్ఞా : చాల్లే! అదుగో డాక్టరుగారు. మాటల్లోనే వచ్చేశారు. నే చెప్పలేమా.

డాక్ట : నేను ఐక్యరాజ్యసమితి తరఫున వచ్చాను. అమృతం ఇవ్వడానికి.

రా : నిజంగానే? ఏవండీ, మీరన్నమాట నిజమేనండీ?

కవి : జ్ఞానంమాట నిజం కాకపోతే అబద్ధమవుతుందా.

డాక్ట : ఆ. ఆ. ప్లీజ్ హర్రి అప్! నే నింకా చాలాచోట్లకి వెళ్ళాలి. ఈ ఇంట్లో యెంతమంది వున్నారు?

కవి : మేం ముగ్గురం. అవతలి గదిలో మా మేనకోడలు కళ నిద్ర పోతూంది.

డాక్ట : ఆవిడ నొక్కసారి లేపుతారా?

కవి : ఆవిడ కాదండి, అమ్మాయి. పదేళ్ళ పసికందు.

డాక్ట : అయితే నేం? ఈ మందు తీసుకుంటే ముప్ఫయ్యేళ్ళ దవుతుంది, సరే! తాతగారూ, మీకు టాబ్లె టియ్యనా?

జ్ఞా : అక్కర్లేదు. ఇంజక్షన్ తీసుకుంటాను.

డాక్ట : సరే.

జ్ఞా : అ — మ్మ.

డాక్ట : అమ్మా — మీరు?

రా : మాత్ర ఇయ్యండి.

డాక్ట : ఇదండి.

కవి : ఇదుగోనంపి కళ!

డాక్ట : అమ్మాయీ ఇంజక్షనిస్తే భయపడవు కద !

కళ : నా కేం భయం ? ఇయ్యి.

డాక్ట : ఏదీ చెయ్యి ?

కళ : మ్....

డాక్ట : మరి మీరు ?

కవి : ఇంజక్షనే ఇయ్యండి. కాని ఏం లాభం. అమృతం తీసుకున్నా, తీసుకోకపోయినా నేను ముప్పయేళ్ళవాడినే. అబ్బ ! కసికొద్దీ పొడిచేశారే డాక్టరుగారు.

డాక్ట : ఇంజక్షన్లు తీసుకున్న ముగ్గురూ, ఈ కాగితాలమీద సంతకం చెయ్యండి. అమ్మా, మీరు దీనిమీద. థ్యాంక్స్. నే వస్తా.

కవి : వెళ్ళి నిద్రపో కళా.

కళ : ఇదేవిటి మామయ్యా. ఏవిటో ఒళ్ళంతా.

కవి : ఏం లేదులే, వెళ్ళు. పడుకో. తెల్లారాక మాట్లాడుకుందాం.

* * *

ఎనౌన్సర్ : ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యంక్రింద ప్రపంచం అంతటా ప్రజలందరికీ ఏక కాలంలో అమృతం పంచిపెట్టినట్లు కేంద్రకార్యాలయానికి రిపోర్టులు వచ్చాయి. ఎన్ని కోట్లమందికి అమృతం అందిందో ఆ వివరా లింకా తెలియలేదు. నిన్నటి జనాభా లెక్కలనుబట్టి నేటి పరిస్థితిని అంచనా వెయ్యడానికి వీలులేదు. ఎందుచేతనంటే అర్ధరాత్రి దాటేసరికి, ప్రపంచంలో అనేక లక్షలమంది మరణించారు. అనేక లక్షలమంది జన్మించారు. మరణించినవారికి కూడా మంది య్యడమైతే జరిగింది. కాని వాళ్ళు బతికారో లేదో ఆ వివరాలు కూడా యింకా అందలేదు. ఉదయం కాగానే అవీ తెలుస్తుంది.

* * *

కవి : ఉదయం అయింది.
నవోదయం ఇది
మహోదయం ఇది
శుభోదయం.

స్వాగతం నూతన సంవత్సరానికి
స్వాగతం నూతన శతాబ్దానికి.

ఉదయం.
నిద్ర మేల్కొన్న రాత్రి నేటితో వికసించింది
విహంగాలూ, విమానాలూ పంపించేశాయి నిశ్శబ్దాన్ని
వేళలోకి వేళాకోళంలోకి
వేళాగోళంలోకి....

జ్ఞా : వేళ గోళంకాదు. సరళ రేఖ. ఇది స్థలం అనే యింకో సరళరేఖకు సమానాంతరంగా ప్రసరిస్తుంది.

రా : అబ్బ ! ఎప్పుడూ మీ వాకటే గోల. పదండి పెళ్ళిరిజిస్ట్రారు దగ్గరికి.

జ్ఞా : ఉండు. ఏం తొందర.

రా : అవును. తొందరే ! తెలారగానే బయల్దేరుతా నన్నారు.

జ్ఞా : నీ తెలివి తెల్లారినట్టే ఉంది. నిజం చెప్పమంటావా ?

రా : చెప్పండి.

జ్ఞా : నిన్ను పెళ్ళి చేసుకోను.

రా : ఏమిటీ !

జ్ఞా : నిన్ను పెళ్ళాడాలనే ఉద్దేశం మార్చుకున్నాను.

రా : నిన్నటి వాగ్దానం నేడు మారిపోయిందా ?

జ్ఞా : ఔను ! నిన్నటి పరిస్థితి వేరు. నేటి పరిస్థితి వేరు.
నిన్నటి శతాబ్దం వేరు. ఇవాళ శతాబ్దం వేరు.
నిన్నటి నేను వేరు, నేటి నేను వేరు.
నిన్న నా వయస్సు డెబ్బయ్యేళ్ళు. ఇవాళ నా వయస్సు ముప్పయ్యేళ్లు

రా : ఆఁ అదీ సంగతి. ఆ కళ అనే అమ్మాయిని చూశారూ. కామవికారం బయల్దేరింది. మనది పవిత్ర ప్రేమ అన్నారు. మనసులు కలిసిన మనోహర ప్రేమ అన్నారు. అయినా పదేళ్ళ పిల్లతో ప్రణయ కలాపా లేమిటండీ మీకు.

జ్ఞా : అక్కడే పొరపడుతున్నావు. ఇదిగో ఆ అమ్మాయి కూడా వచ్చేసింది. ఇవాళ కళ వయస్సు కూడా ముప్పయ్యేళ్ళు.

కళ : నమస్కారం జ్ఞానం తాతయ్యా.

జ్ఞా : నన్ను తాతయ్యా అనకు. నాకు కోపం వస్తుంది

కళ : ఎందుకూ కోపం ఉన్నమాట లన్నందుకా.

జ్ఞా : నేను తాతనన్నమాట నిజంకాదు. నిన్ను పెళ్ళిచేసుకుంటాను కళా.

కళ : ఆ ?

కవి : ఏమండీ ఏమండీ ఏవిటా పేలాపన.
ఆపండీ ఆపండీ చాలు నీ ఆలాపన.
అమ్మాయీ, కళా అవతలకి పో.

జ్ఞా : కళా....కళా....వెళ్ళకు.

సిరి : వెళ్ళిపోయింది కళ. నేనూ దానివెంటనే వెళ్ళుతున్నాను.

జ్ఞా : రాజ్యం. నా మాట విను. వెనుకటిలాగే మన మనసులు కలిసిన మైత్రి అచంచలంగా అకళంకంగా సాగనీ.

రా : ఇదంతా నా కనపపరం. నన్ను పెళ్ళి చేసుకుంటారా లేదా.

జ్ఞా : యాభయియేళ్లాయి పెళ్ళిలేకుండా ఉన్నదానివి ఇవాళ పెళ్ళి కింత తాపత్రయం ఎందుకు రాజ్యం ?

రా : చాల్లెండి. ఇప్పుడు నేను 50 ఏళ్ళదాన్ని కాను. నా వయస్సు కూడా 30 ఏళ్ళే.

జ్ఞా : ఔను సుమా. పరాకుపడ్డాను. కాని నువ్వు నా కళ్ళకి యాభై యేళ్ళ దానిలాగే కనబడుతున్నావు.

రా : కనబడనా మరి. కళని చూసిన కళ్ళకి కామెర్లు కమ్మినట్టుంది.

కళ : మళ్ళీ వచ్చాను తాతయ్యా.

జ్ఞా : అదిగో ఆమాటే అనొద్దన్నాను.

కవి : నేను కళని పెళ్ళిచేసుకోదలిచాను సార్. కళ కూడా అంగీకరించింది.

జ్ఞా : ఏమిటి నన్నడగకుండానా?

కవి : ఎందుకూ మిమ్మల్నడగం?

జ్ఞా : కళని నేను కళత్రంగా చేసుకోవాలనుకున్నానే:

రా ; ఇదుగోనండోయ్. ఏమండోయ్, ఏమిటా మాటలు? సిగ్గూదికీయమూ లేవూ. ఏళ్ళు రాగానే సరా?

జ్ఞా ; ఏమిటంటున్నావ్?

రా : మీ కొచ్చినవన్నేళ్ళు ఎవరి కొచ్చాయంటున్నాను.

జ్ఞా : నాకేమీ ఏళ్ళు రాలేదు. పైగా పోయాయి. నలభై ఏళ్ళు పోయాయి. నా వయసిప్పుడు ముప్పయి, తెలుసా.

కళ : వయస్సు ముప్పయి అయినా ముసిలి భావాలు నీలో పోలేదు తాతయ్యా.

జ్ఞా : అదుగో మళ్ళీ నువ్వు పదేళ్ళ పసిపిల్లలాగ మాటాడడం లేదూ. అయినా ఇప్పుడదంతా ఎందుకుగాని........కళా....కళా....

కవి : జ్ఞానంగారూ మమ్మల్ని మీరు ఆశీర్వదించాలా.

జ్ఞా : ఆశీర్వదించే స్థితిలో నేను లేను.

కవి : కళ మిమ్మల్ని పెళ్ళాడే స్థితిలో లేదు.

జ్ఞా : ఎందుకు లేదు?

కవి : నన్ను పెళ్ళాడబోతోంది కనుక.

రా : లేదు సిరీ. ఈ ముసిలాయనతో విసుగెత్తిపోయింది నాకు. వేధించుకు తిన్నాడు ఇన్నాళ్ళూ కావలిస్తే ఆయన్నే పెళ్ళిచేసుకొమ్మను కళని. కో అంటే కోటి మంది ఉన్నారు. ఎవర్నో ఒకర్ని ఎన్నుకుంటాను.

కవి : రాజ్యంగారూ ....

రా : అవును. నా మనస్సు మారిపోయింది. పశ్చాత్తాపంతో పరితపిస్తున్నాను.

కళ : తాతయ్యా—

జ్ఞా : అదుగో ఆ మాటే అనొద్దన్నాను. నా మనస్సు మారిపోయింది. నిన్ను పెళ్ళి చేసుకోను నేను.

కళ : చేసుకుంటానంటే మాత్రం ఒప్పుకునే వాళ్ళెవరు ?

జ్ఞా : లక్షణంగా ఒప్పుకుంటావు. నాలాంటివాడు నీకు దొరకడం ఎలాగ?

కవి : నేను దొరికేనుగా. నన్ను కాదని కళ ఇంకొకణ్ణి ఎలా పెళ్ళాడు తుందో నేనూ చూస్తాను.

జ్ఞా : ఒరే సిరీ, నువ్వూరికే మాట్లాడకు. కళని నేను పెళ్ళిచేసుకోవడం ఖాయమయిపోయింది. కావాలిస్తే నువ్వు రాజ్యాన్నేలుకో.

కవి : హాస్యానిక్కూడా ఒక హద్దుంది. రాజ్యానికి నేను అర్హుణ్ణి కాను.

జ్ఞా : కాని రాజ్యం నిన్ను వరించింది. ఆమె కళ్ళల్లోని కాంతుల్ని చూడు. నువ్వు సై అంటే ఆమె జై అంటుంది.

కవి : నేను కై అని కూడా అనను.

జ్ఞా : అమ్మాయీ సిరీ, మనం నలుగురం కూడబలుక్కొని ఒక అంగీకా రానికి రావాలి రాజ్యం ఏమంటావు నువ్వు. అంగీకారానికి వస్తా నంటావా.

రా : రానంటాను. పెళ్ళే చేసుకోనంటాను.

జ్ఞా ; ఒక వేళ నేను చేసుకుంటానంటే ?

రా : దాటి పోయిందా తరుణం.

జ్ఞా : అయితే నా ఒట్టుతీసి గట్టుమీద పెట్టెయ్యవచ్చునా ?

ఒక స్త్రీ కంఠం : వేసిన ఒట్టు తీస్తావురా రాస్కెల్.

జ్ఞా : ఎవరు నువ్వు ?

స్త్రీ : తరువాత చెబుతా. ఈ విషమ బాహుచతురస్రాన్ని ఎలా స్క్వేర్ చేస్తారు.

జ్ఞా : మా తరంకాదు.

కవి : నువ్వే చెప్పు. ఎవరివో నువ్వే చెప్పు.

జ్ఞా : మా సమస్యని నువ్వే పరిష్కరించు.

రా : ఎవరిని ప్రేమించాలి నేను.

కళ : ఎవరిని వరించాలి నేను.

రా : ఎవరిని పెళ్ళాడాలి నేను.

రా : అసలీ పెళ్ళి అవసరమా.

కవి : నువ్వే చెప్పు. నువ్వే చెప్పు.

జ్ఞా : ఎవరివి నువ్వు ?

* * *

స్త్రీ : నేను దైవాన్ని, నేను సత్యాన్ని
దైవాన్ని నేను మాట్లాడుతున్నాను (వినండి వినండి)
మానవుణ్ణి నేను సృష్టించలేదు
మానవుడె నన్ను సృష్టించాడు.
అతని మనస్సు నన్ను సృష్టించింది
నాకు ఆకారం లేదు, వయసు లేదు
నేను ఆడా కాదు, మగా కాదు
నేను దైవాన్ని, నేనే కాలాన్ని, నేనే సత్యాన్ని
మరణాన్ని మానవుడు జయిస్తే
కాలాన్ని మానవుడు జయిస్తే తన
మనస్సునే మానవుడు గెలిస్తే
అప్పుడు నేను లేను
ఇప్పుడున్నాను నేను
గెలవగలడా మానవుడు కాలాన్ని
గెలవగలడా మానవుడు మరణాన్ని
జయిస్తాడా మానవుడు మనస్సుని
మనస్సులోనివి ఆలోచనలు
వాటి స్వరూపం భాషలో నిరూపణం
అనేక భాషలు మాట్లాడే మానవుడు
ఒక్క భావాని కెప్పుడూ రాలేదు.

మానవుడు మానసిక సమానత్వం సాధించాలంటే
మారాలి మానవుల భాష
మాట్లాడాలి మానవు లంతా ఒకే భాష
అప్పుడే సాధ్యం మానవునికి మానసిక స్వాతంత్ర్యం
ఒక ఇంటిలోవున్న ఒక నలుగురికి
ఏకాభిప్రాయం లేకపోయిందే
ఇక సమస్తప్రపంచానికీ ఏకాభిప్రాయం ఎప్పుడు ?

కోరస్ : ఇప్పుడు-ఇప్పుడు-ఇప్పుడే
మరణాన్ని జయించాలన్న మా సంకల్పం మారదు
కాలాన్ని జయించాలన్న మా నిర్ణయం మారదు
స్థలాన్ని జయిస్తే దైవాన్ని జయించినట్టే

స్త్రీ : ఎక్కడ–ఎక్కడ–ఎక్కడ

కోరస్ : ఇక్కడ–ఇక్కడ–ఇక్కడే.

ఎనౌన్సర్ : మానవుడు మరణాన్ని జయించాడు. చంద్రలోకంలోని సుధ జరా మరణాలకి విరుగుడు.

దైవం: కాలాన్ని కూడా జయిస్తావా మానవా ?

జ్ఞా : అది నీ దయ దైవమా.

దైవం: కాలాన్ని నేను. న్యాయాన్ని నేను
సత్యాన్ని నేనే. దైవాన్ని నేను
నేను దైవాన్ని మాట్లాడుతున్నాను
ఇన్నాళ్ళూ మహర్షులద్వారా మాట్లాడాను. మహాపురుషులద్వారా మాట్లాడాను. మహాకవుల ద్వారా మాట్లాడాను. మహాభక్తుల ద్వారా మాట్లాడాను. ఈనాడు నేను స్వయంగా ఈ సభకి అధ్యక్షతవహించి మాట్లాడుతున్నాను. మరణాన్ని జయించిన మానవజాతితో మాట్లాడుతున్నాను.

స్త్రీ : ఎవరివి నువ్వు ?

సిరి : నేను మానవుణ్ని :

స్త్రీ : ఎవరిని నేను

సిరి : నీవు మానవుడివి. మారువేషం వేసుకొచ్చిన మానవుడివి. .

స్త్రీ : అంటే నీవే.

సిరి : నేను

స్త్రీ : అయితే నేనే.

సిరి : నీవు.

స్త్రీ : అంతే అంటావా మానవా.

సిరి : అంతే అంటాను మాధవా.

స్త్రీ : అంతా ఒకటేనా ?

సిరి : అవును.

స్త్రీ : అంటే ?

సిరి : $1+1=1$

స్త్రీ : ఒకటీ ఒకటీ రెండంటారే లెక్కలు నేర్పినవాళ్ళు

సిరి : అదే వాళ్ళ గణితశాస్త్ర పాండిత్యం. నీవూ నేనూ ఒకటే. ఒకటీ ఒకటీ రెండే.

స్త్రీ : నిజం చెప్పావు.

సిరి : మాట తడబడింది మాధవా. గణితాని కతీతమైన భాషలో ఒకటీ ఒకటీ ఒకటే.

స్త్రీ : రెండు కాదంటావా ?

సిరి : రెండు కాదంటాను ?

స్త్రీ : ఒకటీ ఒకటీ ఒకటైతే, రెండూ రెండూ రెండు కావూ ?

సిరి : రెండు రెండ్లు నాలుగే. రెండు మూళ్ళు వారెడే.

స్త్రీ : మూళ్ళంటే !

సిరి : మూరలు, రెండు మూరలు బారెడు.

స్త్రీ : మూడూ మూడూ

సిరి : కీడు.

స్త్రీ : చూడూ చూడూ పాడు.

సిరి : నేను పాడలేనే.

స్త్రీ : కవిసంహావ్ ?

సిరి : ఒహో ! అయితే పాడుతా.

స్త్రీ : దేన్ని గురించి ?

సిరి : రెండు గురించి.

స్త్రీ : రెండు. ఇప్పు డెంత టైమయింది.

సిరి : కాలం ఆగిపోయింది. చాలాకాల మయింది.

స్త్రీ : చతురస్రం సమబాహువయిందా ?

సిరి : అయింది.

స్త్రీ : అయితే చదువు నీ పద్యమో ఏవో ?

సిరి : పద్యం కాదు, పాటే. దాన్ని పాడను. అంటాను.

స్త్రీ : అను.

సిరి : విను.

రెండు ఖడ్గాలు
రెండు ఖంజరీటాలు
రెండు అగ్నిపర్వతాలు
రెండు ఆంజనేయ దండకాలు జోజో జేజే
రెండు కంకాళాల కార్తిక దీపాలు
రెండు రాబందుల రా (జా) జీ నామాలు
రెండు కళ్ళు తెరిచిన నాగళ్ళు
రెండు పిడికిళ్ళు బిగించిన కొడవళ్ళు హాహా హుహు
రెండు కళ్లు
రెండు కళ్ళజోళ్లు

రెండు కళ్ళజోళ్ళ నోళ్ళు

రెండు కళ్ళజోళ్ళ నోళ్ళ వాగుళ్ళు హిహి రీరీ

రెండు టెలిగ్రామ భాషలు

రెండు సమస్తాంధ్ర ఘోషలు

రెండు నిండు కొబ్బరికాయలు

రెండు ఎండు నారింజకాయలు హాహా బీబీ

రెండు చమపురాని విస్తరాకులు

రెండు దారితప్పిపోయిన కిరీటాలు

రెండు చీకట్లో రాకాసి కేకలు

రెండు నిలబడ్డ నిట్టూర్పు కొరడాలు దాదా వీదీ

రెండు వేషాలు విప్పివేసిన తలగడాలకింద నిద్రమేల్కొన్న నక్షత్రాలు

రెండు నిశ్శబ్దాలు విసిరిన సరిగమపదనిశలమీద నడలు పరికించిన విలోల కల్లోలాలు

రెండు యుగాంతాల సందున దిగంతాల మాటున వసంతాలాడుతున్న అనంతాలు నేనా నేనా

రెండు జగన్నాధ రధరధరథాధరధరాధర
రసాతల (జల) పాతాళాలు

రెండు స్వయం శ్యమంతకం ప్రకంపమాన
లోకాలోక విలోకనాలు

రెండు భ్రమాభ్రమర భ్రమణ భ్రమరణ భ్రమా
వరణ బ్రహ్మవైవస్వత మన్వంతరాలు

రెండు నవరత్న రంధ్ర రసప్రపంచ మహాప్రస్థానాలు

రెండు తృణావర్తాలు

రెండు విప్లవరాగాలు

రెండు చాలీవాలని కాలీకాలని లంగావంచాలు

రెండు ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్ థియేటర్ స్టార్లు

రెండు ఆరుద్రాభిషేకాలు

రెండు రిక్షాపై మౌనశంఖాలు

రెండు విజయార్భాటాలు

రెండు హనుమంతాస్త్రిలు

రెండు సంపత్కుటుంబాలు

రెండు నమస్కరించదగిన విశ్వనారాయణాస్త్రిలు

రెండు నామరహిత ఫిడేలు రాగాలాపాలు

రెండు గోరావీ వినాయకారాహారాలు

రెండు పతా పితా కజాంతోరకుతారాలు

రెండు తృవ్వట బాబా! సిగపై పువ్వులు!

రెండు సిరిసిరి మువ్వల నవ్వులు

రెండు చీరెండ వాసన ఒకట్లు

రెండు తుపఫాసు కవిత్వాల రకట్లు

రెండు సిన్‌సిన్‌సిన్ కిస్‌కిస్‌కిస్ కోణాలు

రెండు ఖడ్గాల కంఖాణాలు

## 36

రెండు కళ్ళ నోళ్ళ
రెండు కళ్ళు తెరిచినా పిడికిళ్లు బిగించిన
మానవ సరోవరంలో వికసించిన
మందారాక్షరాల మరచిపోలేని
ముద్రాక్ష సముద్రాక్ష సరాలు.



37

# గవేషణ

(మిలిటరీ మార్చి రికార్డు వినబడుతూ ఉంటుంది)

ప్రకటన : భూలోకంలో ఒక మానవుడు తన ముప్పయి అయిదో యేట చచ్చిపోయాడు. అతని ఆత్మని మృత్యుదూతలు మిలిటరీ పహరాతో మరో ప్రపంచానికి తీసుకుపోతున్నారు. ఆ లోకంలో అతని ఆత్మని ఒకానొక న్యాయస్థానంలో అప్పగించ వలసిందిగా మృత్యుదూతలకి ఉత్తరువు. దారిలో హఠాత్తుగా మానవుడు మేలుకొంటాడు. తా నింకా బతికిఉన్నానని మృత్యుదూతలతో వాదిస్తాడు.

(ఫేడౌట్. మిలిటరీ మార్చి)

(ఫేడిన్-మానవుని గొంతుక)

మానవుడు : ఇదేమిటి ? మీరంతా ఎవరు ? ఎక్కడికి తీసుకపోతున్నారు నన్ను ? మాట్లాడరేం ? మాటలురావూ మీకు ?

ఒక మృత్యుదూత : మాట్లాడకుండా నడవ్వయ్యా మానవుడా.

ఇంకొక మృత్యుదూత : ఈ మనిషి చచ్చిపోయాడుకదా ఎలా మాటలాడ గలుగుతున్నాడు ? ఎప్పుడూ ఎరగని విడ్డూరం.

మాన : నేను చచ్చిపోయానా ? మీకేం మతిపోయిందా ? మనిషంత మనిషిని నేను కనబడుటలేదూ నీకు ?

2వ మృ : నిన్ను చూడనక్కరలేదు. నీకు శరీరంలేదు. నువ్వు చచ్చి పోయావు. నీ కళేబరం యిప్పుడు మీ పల్లెటూరి వల్లకాట్లో ఉంది.

మాన : నేను బతికే ఉన్నాను. నన్ను వదలిపెట్టండి. నా లోకానికి పోతాను. నా యింటికి నేను పోతాను. నన్ను వదలిపెట్టండి.

1వ మృ : నిన్ను వదలిపెట్టటానికి ఉత్తరువు లేదు. న్యాయమూర్తిముందు నువ్వు నిలబడబోతున్నావు. నిన్నక్కడ విచారణ చేస్తారు.

మాన నే నేం పాపం చేశాను ?

1వ మృ : ఏమో. మమ్మల్ని అడగవద్దు. మాట్లాడకుండా రా.

2వ మృ : ఈ మానవుడు చచ్చిపోయాడు కదా ఎలా మాటలాడుతున్నాడు ?

మాన మళ్ళీ అదేమాటా ? నేను బతికే ఉన్నాను.

1వ మృ : అది మాకు అనవసరం. మా ఉత్తరువు ప్రకారం మేము నడుచుకోవాలి.

మానూ ఆ ఉత్తరు విచ్చిన అధికారి ఎవరు ?

1వ : అధికంగా మాటలాడకు. ఆజ్ఞలను ఉల్లంఘించకు.

మానూ:నన్నాజ్ఞాపించుతున్న దెవరు ?

1వ : అందర్నీ ఎవడు శాసిస్తున్నాడో వాడు.

మానూ:అతనిదగ్గరకా నన్ను తీసుకొని వెళ్ళతున్నారు ?

1వ : అబ్బో. అతని దర్శనం అంత సులభంకాదోయ్ మానవుడా. చచచ్చిపోయినవెంటనే విచారణ జరిగే మొదటి న్యాయశాలకి తీసుకు వెళ్ళుతున్నాం నిన్ను.

2వ మృ : ఈ చచ్చిపోయిన మనిషి ఎలా మాట్లాడుతున్నాడో ? ఏదో పొరపాటు జరిగినట్టుంది.

మాన. అవును. నన్ను వదలి పెట్టండి. నేను బతికే వున్నాను. మీరు అనమ్మరూ నన్ను ?

1వ : మేము నమ్మినా, నమ్మకపోయినా నీకేం ప్రయోజనం లేదు. నన్ను వదలి పెట్టగల స్థితిలో మేం లేము. బహుశా నువ్వు బతికే వునున్నావేమో కాని –

మాన: బహుశా అంటా వేమిటి ? నిశ్చయంగా నేను బతికే ఉన్నాను.

2వ మృ: ఎక్కడో పెద్ద పొరపాటు జరిగింది.

1వ మృ: ఈ లోకంలో ఎన్నడూ పొరపాట్లు జరగవు.

మాన: ఏం ఇదేం స్వర్గమా ?

1వ మృ: స్వర్గమనీ, నరకమనీ వేరే వేరే లోకాలు లేవు. నీ పాపం నీ నరకం. నీ పుణ్యం నీ స్వర్గం.

మాన: ఏది పుణ్యం ? ఏది పాపం ? స్వర్గనరకాలు వేరువేరుగా లేకపోతే పుణ్యపాపాలు కూడా వేరు వేరుగా లేవు.

2వ మృ: చచ్చిపోయినవాడివి చచ్చినట్టుండక చట్ట విరుద్ధంగా మాటలాడడం పాపం.

2వ మృ: ఊరుకో. ఊరుకో. ఇతణ్ణి విచారణచేసే అధికారం మనకి లేదు.

2వ మృ: అయితే ఈ మానవుణ్ణి మాటలాడవద్దను. వీడు మాటలాడుతుంటే నా కెందుకో భయం వేస్తోంది.

1వ మృ: మనమేదో తప్పు పని చేస్తున్నట్టు నా అంతఃకరణకి స్ఫురిస్తోంది. చచ్చిపోకముందే మనం ఇతణ్ణి తీసుకుపోతున్నామేమో ?

2వ మృ: ఇందులో మన తప్పేం వుంది. మన కిచ్చిన ఉత్తరువు ప్రకారం మనం నడుస్తున్నాం.

1వ మృ: ఈ మానవుడు బతికే ఉన్నాడు. ఇతణ్ణి న్యాయమూర్తి యెదుట నిలబెట్టడానికి వీలులేదు.

2వ మృ: ఉత్తరువును ఉల్లంఘించవలసిందేనా ?

1వ మృ: ఎంత సంకటం వచ్చిపడింది మనకి. ఎక్కడో తప్పు జరిగింది. దాని ఫలితం మనం అనుభవిస్తున్నాం.

2వ మృ: ఊరుకో. ఊరుకో. తప్పుజరిగిందని నిశ్చయంగా నీకేంతెలుసు ? తెలియందే ఎవళ్ళమీదనైనా ఎలా నేరం ఆరోపించగలవు ?

1వ మృ: ఈ మానవుడు బతికివుండడమే ఇందుకు నిదర్శనం.

2వ మృ: మానవుడు మాటలాడలేదు.

1వ ,, మానవుడు మరణించాడు.

2వ ,, మ రింత సేపూ మాటలాడాడే? ఇది సంభవమా?

1వ మృ : ఇంత సేపూ ఏమో భ్రాంతిలోపడ్డాం మనం.

2వ మృ : మరి మనకంత భయంవేసిందేం? ఎన్నడూ భయమంటే ఏమిటో ఎరగమే మనం. ఒక మానవమాత్రుడు ఎంత హడలుకొట్టించాడు మనల్ని. ఏమో తప్పుచేసినట్లు ఎంత వణకిపోయాం ఇంత సేపూ?

1వ మృ : ఈ లోకంలో ఎప్పుడూ తప్పు జరగదు. ఇదివరకెప్పుడూ మనం బ్రతుకున్నవాళ్ళ జోలికి పోలేదు.

మానవుడు : ఇప్పుడు మీరు నాకు అన్యాయం చేస్తున్నారు; నా ప్రాణాలు తీసేస్తున్నారు. నన్ను నరకబాధ పెడుతున్నారు. నేనేం తప్పు చేశానని? బ్రతికుండగానే నన్నిలా కాల్చేస్తున్నా రేమిటి? తీసుకెళ్ళండి. నన్ను మీ అన్యాయమూర్తి దగ్గరకు తీసుకెళ్ళండి. అతణ్ణే ప్రశ్నిస్తాను - కానీయ్యండి. మీ ధర్మం మీరు నిర్వహించండి, ఆ న్యాయమూర్తి ఎవరో నాకు చూపించండి. బహుశా అతను భగవంతుడు కాడనుకుంటాను. అతనికన్నా తక్కువహోదాలో ఉన్న క్షుద్రదేవత అనుకుంటాను. మా భూలోకంలో యిలాంటి అధికారులు చాలామంది ఉన్నారు. ఇక్కడకూడా ఉన్నారన్నమాట న్యాయాధికారులు.

1వ మృ : ఊరుకో, ఊరుకో. ఇదుగో న్యాయశాల సమీపించాం. మానవుడా! మమ్మల్ని చీవాట్లుపెట్టకు. నీ మరణానికి మేం కారణం కాం. నువ్వసలు చచ్చిపోయావో, బతికున్నావో కూడా మాకు తెలియదు. ఆజ్ఞమేరకు నిన్నిక్కడకి తీసుకొచ్చాం - అంతే.

2వ మృ : ఇక మేం వెళ్ళిపోతున్నాం. ఇక్కడి రక్షక భటులకి విన్నవ్పగించి మేం సెలవు తీసుకుంటాం. మానవుడా! నీ రౌద్రాకారాన్ని చూస్తే, మాకు భయంవేస్తోంది. విచారణలో నువ్వు గెలవాలని త్రికరణశుద్ధిగా కోరుతున్నాం. దేవతలుకూడా పొరపాటు చేస్తారని నీ జీవితంలో రుజువు చేశావు. నువ్వు జీవించే ఉన్నావనటానికి మాకేమీ సందేహంలేదు; మానవుడా! జీవించు.

1వ మృ : మరి మాకు సెలవు. (పావునిమిషంసేపు జంత్ర సంగీతం).

# 2

## ప్రకటన

మృత్యుదూతలు మానవుని ఆత్మని మరోప్రపంచపు న్యాయస్థానానికి చెందిన రక్షకభటులకి అప్పగించి వెళ్ళిపోయారు. రక్షకభటులు ధర్మాసనం మీద కూర్చున్న న్యాయమూర్తి సమక్షంలో మానవుణ్ణి హాజరు పెట్టారు. ఈ న్యాయమూర్తి వయస్సులేని, నేత్రాలులేని ఒక స్త్రీమూర్తి.

న్యాయమూర్తి : మానవుడా ! ఎన్నడూజరగని పొరపా టొకటి ఈ లోకంలో జరిగింది. ఇప్పుడే నీ కాగితాలన్నీ తెప్పించి, పరిశీలించాను. నాకు కళ్ళులేవుగాని చూడగలను. భూలోకంలో నీకింకా అయిదు సంవత్స రాల ఆయుస్సు ఉండగా, ఈ కార్యాలయంలోని ఒక చిన్న ఉద్యోగి తప్పు లెక్కవల్ల మృత్యుదూతలు నిన్నిక్కడికి తెచ్చేశారు. నువ్వు చనిపోయావని నిజంగానే వాళ్ళనుకున్నారు.

మాన : మీరు ధర్మస్వరూపులు. దేవతల పొరపాటువల్ల ఈ మానవుడు బాధపడుతున్నాడు. నన్నుకూడా ఇప్పుడు సందేహం బాధిస్తోంది. నేను బతికున్నట్టా ? చచ్చిపోయినట్టా ?

న్యాయ : మృత్యు రాజ్యపు చట్టప్రకారం నువ్వు చనిపోయినట్టుగానే ఉత్త రువు పడిపోయింది. తక్షణమే మృత్యుదూతలు నీ శరీరంనుంచి నీ ఆత్మని తొలగించివేశారు. నీ కాగితాలు తెప్పించి పై అధికారు లతో నీ విషయమై ఎంతో వాదించాను. ఇక్కడి వ్యవస్థలో ఎప్పుడూ పొరపాటు జరగదనే అందరూ అనుకుంటున్నారు. కాని నీపట్ల మాత్రం పొరపాటు జరిగింది. నీ కన్యాయం జరిగింది. నక్షత్రాల సాక్ష్యం ప్రకారం నీ కింకా అయిదేళ్ళ ఆయువుందని నేను స్థిరంగా నిర్ధారణ చేశాను.

మాన : ధర్మదేవతా : కృతజ్ఞుణ్ణి.

న్యాయ : నువ్వింక భూలోకానికి పోవచ్చు. నీ ఆత్మని దేవదూతలు మర్యా దగా మీ పల్లెటూళ్ళో వదలిపెడతారు. మా పొరపాటువల్ల నీకు అన్యాయం జరిగినందుకు మేమందరమూ సిగ్గుతో తలవంచుకుంటు

న్నాము. భగవంతుడు కూడా ఆయన్ని నేనెప్పుడూ చూడలేదుగాని ఈ జరిగినదాని కెంతో బాధపడుతూ వుంటాడు.

మాన : ధర్మదేవతా ! భగవంతుణ్ణి మీరు చూడలేదా ఎప్పుడూ ?

న్యాయ : భగవంతుడు ధర్మానికి కూడా అతీతుడు. ఈ చర్చ లిప్పుడు వద్దు. ఇక నేను సభ చాలిస్తున్నాను. నువ్వు భూలోకానికి వెళ్ళు. (అర నిమిషంసేపు జంత్ర సంగీతం).

# 3

ప్రకటన : దేవదూతలు మానవుని ఆత్మను అతని పల్లెటూళ్ళో దిగవిడిచి పోయారు. కాని అప్పటికే అతని శరీరాన్ని బంధువులంతా దహనం చేసివేశారు. ఇంకా అయిదేళ్ళ జీవితంవున్న మనుష్యుని ఆత్మ నివ సించడానికి శరీరంలేదు. తన శరీరాన్ని వెతుక్కుంటూ ఆత్మ ఆ రాత్రంతా ఎంతో అల్లాడింది. మళ్ళీ ధర్మదేవత దర్శనం చేసుకుంటే బాగుండునను కుంది. కాని ఈ లోకంలోని ఉన్నతాధికారుల దర్శనం చేసుకోవాలంటేనే ఎందర్నో ఆశ్రయించి ఎన్నెన్నో తిప్పలుపడాలే. ఆ లోకంలోని అధికారిని దర్శించడం అంటే మాటలా ? నిన్న తన ప్రయత్నం లేకుండానే ధర్మదేవత కనబడింది. ఈరోజు ఎక్కడుందో కూడా తెలియదు. అయినా తన ప్రయ త్నాన్ని ఆత్మ వదిలిపెట్ట దలుచుకోలేదు. సమస్త దేశ కాలావధులలో స్వతంత్రంగా నిరాఘాటంగా సంచరించ గలుగుతోంది ఆత్మ. కాని, పంచ భూతాలలో కలిసిపోయిన తన శరీరం మాత్రం ఎంత వెదికినా మళ్ళీ కని పించదు. ఇదేమిటీ ఉపద్రవం ? ఎక్కడో ఎవ్వరో చేసిన పొరపాటుకి తా నెందు కింత బాధ పడాలి ? మళ్ళీ తాను మరో ప్రపంచానికి వెళ్ళి ఎలాగైనా తన శరీరాన్ని తన కిప్పించవలసిందని న్యాయమూర్తి యెదుట ఫిర్యాదు చెయ్యడానికి మరణ జీవితాల మధ్య అల్లాడుతున్న మానవుని ఆత్మ నిశ్చ యించింది.

మరో ప్రపంచపు న్యాయస్థానం వెలుపల పెద్ద పెద్ద సొరంగాలవంటి వరండాలు. కీచురాళ్ళ చప్పుడు. (ప్రవేశం ఆత్మ రూపంలో మానవుడు.)

మాన : ధర్మదేవతా! ధర్మదేవతా!

(ఎవరూ పలకరు. కాలావధుల కొసనుంచి అతని జాలికేకకు అదే జవాబుగా ప్రతిధ్వని. చీకటి గుహల్లోంచి నదులు ప్రవహించిన చప్పుడు.)

మాన : న్యాయమూర్తీ ! న్యాయమూర్తీ !

(ఎవరూ పలుకరు, ప్రతిధ్వని తప్ప. తర్వాత గాజు పెంకులు పగిలి పోయినట్లు నవ్వు)

నవ్వినమనిషి : ఈ భగవంతుని న్యాయస్థానంలో ఎవరయ్యా నువ్వు ?

మాన : నేనో మానవుణ్ణి. నాకింకా అయిదేళ్ళ ఆయుర్దాయం ఉంది. (నవ్వు) ఎందుకలా నవ్వుతావు! ఎవరివి నువ్వు?

నవ్విన : ఎవరినైతేనేం? ఆనందం అనుకోనన్ను మాటవరసకి. ఏకం నా సంఖ్య. ఎప్పుడూ ఇక్కడే నా ఉద్యోగం. నీకు ప్రస్తుతం సాయం చెయ్యడానికి వచ్చాను.

మాన : సంతోషం. నిజంగా ఇది స్వర్గలోకంలా ఉంది.

నవ్విన : ఇక్కడి ఉద్యోగుల్ని కొందర్ని చూస్తే ఇదే నరకం అనుకుంటావు నువ్వు. వాళ్ళ దాహం నువ్వు తీర్చలేవు. మాటవరసకి నాలోనే మరో దుర్మార్గపు వేపుంది. మాటవరసకి నీకు నేను న్యాయమూర్తి దర్శనం చేయిస్తాననుకో. నాకే మాత్రం లంచం చదివించుకో గలవు?

మాన : ఇంకా సందేహమా? ఇది నరకం.

నవ్విన : అన్నీ నీ మనస్సులో నువ్వే కల్పించుకొంటున్నావు. నిష్కల్మషంగా నీకు సహాయపడాలని వచ్చాను. మాటవరసకి నువ్వు కోరిన వరం ఇస్తాను. నేను కోరే హవిస్సులతో నన్ను సంతోషపెట్టు.

మాన : ఆనందానికి ఆనందం కలిగించాలా నేను? నన్ను నేను హోమం చేసుకుంటున్నాను ఇది చాలదా నీ తృప్తికి నిన్ను నూటఎనిమిది పేర్లతో పిలిచి స్తోత్రం చేస్తాను. నీకు జాలి గలగదూ. ధర్మదేవతను చూపించవూ?

నవ్విన : ధర్మదేవతా దర్శనం! అదంత సులభమను కున్నావా మానవుడా. మాటవరసకి అందుకెంత తపస్సు కావాలో ఆలోచించవా?

మాన : నేను కోరకుండానే నిన్న ఆవిడ నాకు దర్శన మిచ్చింది.

నవ్వినవ్యక్తి : నువ్వు భూలోకపు కాల పరిమితులలో మాట్లాడడం మాని వెయ్యాలి. మాటవరసకి నిన్న చూశావో, కొన్ని యుగాలక్రిందట చూశావో ఎవరికి తెలుసు? ఇంతకీ నువ్వెందుకు ఆవిడను చూడాలి?

మాన : నీకు తెలియదా మహానుభావా! నా నోటంట చెప్పించాలా?

న. వ్య : నువ్వేదో దావాలో గెలిచావటకాదూ ?

మాన : గెలిచానో, ఓడానో : ఈ ప్రాణాని కేమీ సుఖంలేదు. నా శరీరం నాకు దొరికితే బాగుండును.

న. వ్య : ఏమైంది నీ శరీరం ? ఎక్కడ పారేసుకున్నావు ?

మాన : నే నేమీ పారేసుకో లేదు. మీ న్యాయస్థానంలో ఒక ఉద్యోగి చేసిన పొరపాటువల్ల నాకు మరణం సంభవించింది.

న. వ్య : అలాగనా పాపం.

మాన : ధర్మదేవత నా జీవితాన్ని నాకు మళ్ళీ ప్రసాదించింది. కాని మా వాళ్ళు నా శరీరాన్ని దహనంచేసి వేశారు. నిన్న రాత్రంతా నే నెంతో యాతనపడ్డాను. ఒక చచ్చిపోయిన గబ్బిలం శరీరంలో ప్రవేశించాను. గబ్బిలంగా బతకడం ఎంత కష్టం. చాలాసేపు ఒక చెట్టు కొమ్మని పట్టుకొని వేలాడేను. నూతిలో ఒక కప్ప చచ్చి పోయివుంది. పోనీ అని దాని ఒంట్లోదూరేను. కప్పబతుకు, అందులోకీ నూతిలోని కప్పబతుకు అదీ ఉక్కిరి బిక్కిరిగానే ఉంది. నాకు మిగిలిన అయిదేళ్ళూ నా బతుకు నేను బతుకక ఇంకో జంతువుని ఎందుకు కావాలి నేను ?

న. వ్య : పోనీ మనిషిగానే బతకలేకపోయావూ ? మాట వరసకి భూలోకంలో మనుష్య కళేబరాల కేం తక్కువ ? అనుక్షణం ఎందరు మరణించడంలేదు ? కాశ్మీరంలో, మలయాలో, జావాలో—

మాన : ముప్ఫయి అయిదేళ్ళు నేను నేనుగా జీవించాను. నా శరీరంతో

సమాధానపడ్డాను. అదిమాని ఇంకొకరి బతుకు నే నెలా బతగ్గలను చెప్పు ?

నాడి అలవాట్లు వాడి ఆలోచనలు అన్నీ వాడివే. పోనీ ఎలాగో కష్టపడి వాటినే అవలంబిస్తాననుకో, అప్పటికీ నాది అబద్ధం బతుకే అవుతుంది.

న. వ్య : ఎక్కడో జరిగిన ఒక తప్పువల్ల ఎంత ఇబ్బందిలో పడ్డావు నువ్వు ! నీకు సాయపడాలని వుంది నాకు. నువ్వు నా కే లంచాలూ ఇవ్వనక్కరలేమలే. నీకేం సహాయం కావాలో చెప్పు. నీ శరీరాన్ని మాత్రం చూపించమనకు.

మానవుడు : ధర్మదేవతని చూపించు.

న. వ్య : ఆవిడమాత్రం ఏం చెయ్యగలదు ? ఆవిడే కాదు ఎవ్వరూ యిక నీ శరీరాన్ని నీ కివ్వలేరు.

మాన : దేవతలకి కూడా అసాధ్యమైన కార్యాలున్నాయా ?

న. వ్య : మానవుడివి కాబట్టి నీకు దేవతల శక్తిమీద విపరీతమైన విశ్వాసం వుండడం సహజమే, కాని దేవాదిదేవులు కూడా పురోగమనశీలమైన కాలాన్ని వెనక్కి మళ్ళించలేరు. కావాలంటే నీకు ధర్మదేవత దర్శనం ఇప్పిస్తాను. లేదా ఇంకేదేనా సహాయం కావాలంటావా ? చెప్పు చేస్తాను.

మాన : అక్కర్లేదు. ఆవిడని చూపిస్తే చాలు. ఆవిడ నా కేహో దారి చూపిస్తుంది. ధర్మదేవత ఏం చెయ్యమంటే అది చేస్తాను.

న. వ్య : అయితే పద.

(పావు నిమిషం జంత్రసంగీతం)

# 4

(ప్రకటన : నవ్వినవ్యక్తి, అనగా ఆనందం, తన వాగ్దానం ప్రకారం శరీరంలేని మనిషిని న్యాయమూర్తి సమక్షానికి తీసుకెళ్ళాడు)

మాన : ధర్మదేవతా ! నిన్ను సందర్శించడానికి నేను ప్రచండమైన తపస్సు చేశాను. వర్ణనాతీతం నేను పడుతున్న క్షోభ.

న్యా : మళ్ళీ వచ్చావెందుకు మానవుడా ! ఈ మారు నువ్వు తెచ్చిన అభియోగం ఏమిటి ?

మాన : నా శరీరం దగ్ధమైపోయింది. నేను నిలవడానికి నీడలేదు. మీ రిచ్చిన అయిదేళ్లూ తీసుకున్నా తీసుకోండిగాని, నిరాశ్రయంగా నన్నీ అనంతవిశ్వంలో పరిభ్రమించ నివ్వకండి.

న్యాయ : మొదటిసంగతి. ఆ అయిదేళ్ళూ నే నిచ్చినవి కావు. రెండోది వాటిని తీసుకొనే శక్తిగాని, అధికారంగాని నాకు లేవు.

మానవుడు : మరి నన్నిప్పు డేం చెయ్యమన్నారో మీరే చెప్పండి. జీవితం నుంచి నేనొక కాందిశీకుణ్ణయిపోయాను. ఇంకొకడి బతుకు నేను బతకలేను. ఎందుకు నాకీ అయిదేళ్ళు ?

న్యా : పోనీ, ఇదిచెప్పు. ఇంకో కొత్తబతుకు ప్రారంభిస్తావా ?

మాన : అంటే ? నాకు బోధపడలేదు. ఈ అయిదేళ్ళ కాలంలో యింకో కొత్తబతుకు ఎలా సాధ్యమవుతుంది నాకు ?

న్యా : అయిదేళ్ళే అన్న పరిమితి తొలగిస్తాను. నీయిష్టం వచ్చిన శరీరంలో నువ్వు ప్రవేశించు.

మా : వద్దు తల్లీ వద్దు. నన్నీ జన్మదుఃఖపు చెరనుండి విడిపించు!

న్యా : జన్మరాహిత్యమే : అదిమాత్రం నన్నడక్కు. ఆ వరం నే నివ్వలేను. నీకో జీవితా న్నివ్వగలను. నీకో శరీరాన్ని చూపించగలను. అంతేగాని జన్మరాహిత్యాన్ని ప్రసాదించేశక్తి నాకు లేదు.

మాన : దేవతలు తమ అశక్తిని నాదగ్గర చెప్పుకుంటున్నారంటే నవ్వాలో ఏడవాలో నాకు తెలియదు. కానియ్యండి. జరిగిన పొరపాటేదో

జరిగిపోయింది. నేను భూలోకానికి పోతున్నాను. ఏదో ఒక శరీరంలో దూరుతాను. ఏదో ఒక బతుకు ఎలాగో ఒకలాగ బతుకుతాను. ఎప్పుడు మీరు పిలిపించుకుంటే అప్పుడు వస్తాను. ఇప్పుడు నాకు బోధపడింది. నేను మీ చేతిలో ఎలా ఆటవస్తువునో. ఇంకొకడి చేతిలో మీరు అలా ఆటవస్తువులు. ఆ ఇంకొకడు మరొకడిచేతిలో. ఆ మరొకడు వేరొకడి చేతిలో. ఇలాగ ఇది అనంతం.

న్యా : సృష్టి రహస్యం అంతా ఇంతే. ఇక చెప్పు మానవుడా. ఏ శరీరంలో ప్రవేశిస్తావు ?

మాన : అన్ని శరీరాలూ ఇప్పుడు నా కొకటే. దేవతల్లోనూ మానవుల్లోనూ కూడా నాకు నమ్మకం పోతోంది.

న్యాయ : ఓయి మానవుడా నువ్వు దేవతలని నమ్మకపోతే పోయావుగాని మానవత్వంమీద విశ్వాసాన్ని మాత్రం విసర్జించకు. నిజమే. నీకు దేవతలవల్ల అన్యాయం జరిగింది. ధర్మదేవతని నేను క్షమించమని కోరుతున్నాను. మానవుడా : దేవతలు నీ క్షమాపణ కోరుకుంటున్నారు. క్షమించవూ ?

మాన : ఎంత మాటన్నావు తల్లీ. ఇదిగో చేతులు జోడించి మొక్కుతున్నాను. ఈ అల్పమానవుడా దేవతలను క్షమించవలసినవాడు. అంతమాట అనకుతల్లీ. నాకు సెలవిప్పించు, నేను భూలోకానికి పోతాను.

ధర్మదేవతలు : ఇందుచేతనే దేవతలు మానవుని ప్రేమిస్తారు, ఈ హృదయ వైశాల్యాన్ని చూచి ! ఓ నరుడా నీకు వరమిస్తున్నాను. నీకు ఎవరి లాగ బతకాలని వుందో కోరుకో.

మాన : నాకు నాలాగతప్ప ఇంకోవిధంగా బతకాలని లేదు అది అసాధ్యమని తేలిపోయింది ఇక ఏ బతుకైతేనేం ? ఎలాగూ కొత్త జీవితం ప్రారంభించాలి. కాబట్టి, సరికొత్త జీవితమే మొదలుపెడతాను. నన్నో అమ్మ కడుపులో పారెయ్యి తల్లీ. అదే నేను కోరే వరం.

ధర్మ : అదిగో మళ్ళీ నాకు లేనిశక్తి సామర్థ్యాలని నాకాపాదిస్తున్నావు. నిన్ను తిరిగి నేను సృష్టించలేను. శిశువుగా జీవితాన్ని ప్రారంభిస్తానన్నావు

కనుక ఇదిగో విను. నీకు పూర్ణాయుర్దాయం ఇస్తున్నాను. ఈ క్షణంలో భూలోకంలో ఒక అమ్మాయి ప్రసవిస్తోంది. కాని ప్రాణంలేని శిశువు అది. అతికష్టంమీద వైద్యుడు ఆ శిశువుని పైకి తీశాడు. ఆ బిడ్డ శరీరంలో నువ్వు ప్రవేశించి బ్రతుకుని ప్రారంభించు.

మావ : మహాప్రసాదం దేవీ.

(అరనిమిషం జంత్రసంగీతం)

# 5

ప్రకటన : భూలోకంలో, ఆంధ్రదేశంలో, ఒక ప్రసూతి వైద్యశాలలో ఆపరేషన్ గది. ఒక అమ్మాయి మృత శిశువును ప్రసవించింది. క్లోరోఫారం నిద్రనుంచి మేలుకుంటోంది. చిన్న మూలుగు. పక్క పెద్ద డాక్టరు నిలుచున్నాడు. మిగిలినవాళ్ళు కొంచెం దూరంగా ఉన్నారు.

డాక్టరు : భయం లేదమ్మా. నీకేం ప్రమాదం లేదమ్మా. అంతా అయి పోయింది.

అమ్మాయి : (నీరసంగా) ఏ మయింది. డాక్టరుగారూ! నా బిడ్డను చూపించరా ?

డాక్టరు : చూదువుగానిలే అమ్మా ! మొదట నీవు విశ్రాంతి తీసుకో.

అమ్మాయి : ఇది చెప్పండి డాక్టరుగారూ ? ఏంపిల్ల మొగాడా, ఆడదా ?

డాక్టరు : పిల్లదేనమ్మా. కళ్ళుమూసుకో, అటు చూడకు.

అమ్మాయి : అబ్బాయి కదలడేమండీ ! ఏడుపు వినబడదేం ?

డాక్టరు : ఏం చెప్పమంటావమ్మా ? నువ్వు ధైర్యంగా వుండాలి.

అమ్మాయి : చెప్పండీ. ఫరవాలేదు. చెప్పండీ, అబ్బాయి చచ్చిపోయాడు. అంతేనా ?

డాక్టరు : ఇంకా ఆశలేక పోలేదు. మా ప్రయత్నాలు మేం చేస్తాం. కళ్ళు మూసుకుని పడుకోఅమ్మా. మాట్లాడొద్దు. కదలవద్దు మెదలవద్దు.

అమ్మాయి : (దుఃఖంగా) నాకు తెలుసు. చచ్చిపోయాను. లాభంలేదు. చచ్చిపోయాను.

మానవుని గొంతుక : నేను చచ్చిపోలేదు. నమ్మండి నేను బతికే ఉన్నాను. (శిశువు రోదనధ్వని కెవ్వుమని వినిపించి క్రమంగా ఫేడౌట్.)



# అనంతర యాత్ర

ప్రకటన : కాలం అంతా ఒకటేగాని అందరికీ ఒకటి కాదు. జీవిస్తున్నవారి కాలం వేరు. మరణించినవారి కాలంవేరు. గర్భంలో ఉన్నశిశువు దొకకాలం. ఇంకా గర్భస్థంకాని జీవి దింకోకాలం. స్టీమరులోనో, విమానంలోనో ప్రయాణం చేస్తున్నవాడికీ, నిద్రపోయి కలలు గంటున్నవాడికీ, మతిపోయినవాడికీ, వైరాగ్య నైరాశ్యాలవల్ల కాషాయం ధరించినవాడికీ, కాలం ఒకేవిధంగా గడవదు.

(రైలుబండి చప్పుడు ప్రారంభం)

తత్వశాస్త్రాధ్యాపకుడు శ్రీ రంగారావు రైలుబండిలో ప్రయాణం చేస్తున్నాడు. నిద్రపోతున్నాడు. అతడుకాక ఇంకా ఆ మొదటి తరగతి పెట్టెలో ఇద్దరుమాత్రం ఉన్నారు. కాంతం, సరళ.

కాంతం : టైమెంతయింది సరళా?

సరళ : సారీ నా వాచీ ఆగిపోయింది.

కాంతం : ముసిలాడు చేతిని వాచీతోనే నిద్రపోతున్నాడు. చూ డెంత టైమయిందో!

సరళ : మర్యాదగా మాట్లాడు కాంతం. ఆయ నెవరో తెలుసా?

కాంతం : ఎవరైతే మనకేం? అయినా ఎవరు?

సరళ : ఆ సూట్‌కేస్‌మీద పేరుచూడు.

కాంతం : ఎ. యస్. రంగారావు. ఇంకో యస్. తక్కువ :

సరళ : షటప్ ఈయన చాలా గొప్పవాడు. మావా రెప్పుడూ ఈయన్ని గురించే చెబుతూంటారు.

కాంతం : సరే ఒప్పుకున్నాం. టైమెంతయిందో చూడమంటే——

సరళ : ఆరు

కాంతం : ఎప్పుడో ఆగిపోయిన నీ వాచీలో కాదు. అదుగో ఆ వాచీలో, ఎంతయిందో చూడవే :

సరళ . నీ వాచీ యేం చేశావ్? పెట్లో పెట్టేశావుకదూ? ఏం ఆ జాగ్రత్త.

సరళ : అక్కయ్యోయ్ :

కాంతం : ఏమిటే అది? నిర్ఘాంతపోయావ్?

సరళ : ఈయన వాచీకూడా ఆగిపోయింది?

కాంతం : మంచిపని చేసింది.

సరళ : కాదే. సరిగ్గా ఆరుదగ్గరే ఆగిపోయింది.

కాంతం : అయితే ఏమంటావ్?

సరళ : ఏమీలేదు, ఎందుకేనా మంచిది. నీ వాచీకూడా చూడు. నా కేమిటో భయం వేస్తోంది.

కాంతం : సూపర్‌స్టిషన్ : భయమెందుకే : అన్ని వాచీలూ సాయంత్రం ఆరుగంటల కాగిపోయాయనే; ఈ రాత్రి ఏదో ప్రళయం వచ్చేస్తుందనే; ఫరవాలేదు నా వాచీ సరిగానే వుంటుందిలే :

సరళ : అయినా ఓ మారు పెట్టె తెరచి చూద్దాం :

కాంతం : చాదస్తం : చాలా రాత్రియింది. ఇక నిద్రపోదాం.

సరళ : అలాగంటే పనికిరాదు. నా గుండెల్లో పెద్ద బెంగపడింది. ఏదీ నీ తాళం ఇలా ఇయ్యి.

కాంతం : ఇవ్వకపోతే?

సరళ : పోనీ నువ్వే తియ్.

కాంతం : చిన్నపందెం వేద్దాం. నా వాచీ తిరుగుతూనే ఉంటుందని నేను, ఆగిపోయుంటుందని నువ్వు.

సరళ : అబ్బ తాళం ఇవ్వకపోతే నన్ను చంపుకు తిన్నట్టే.

కాంతం : ఏమిటా ఒట్లూ నువ్వూనూ ? కావలిస్తే ఇంద.

రంగా : అమ్మాయిగా యింకా నిద్రపోలేదు : అర్ధరాత్రయినట్టుందే. అరే నా వాచీ ఆగిపోయింది.

సరళ : నా వాచీకూడా సరిగ్గా ఆరుదగ్గరే ఆగిపోయిందండీ.

కాంతం : ఊఁ నా వాచీ కూడా తీసిచూడు. ఇవాళ కాలమే ఆగిపోతుందని సరళభయం.

రంగా : కాలం ఎప్పుడూ ఆగిపోదమ్మా. ఇక గడియారాల మాటా ? మూడు గడియారా లొక్కసారి ఒకేచోట ఆగిపోతాయా అంటే అటువంటి సంఘటన అసంభవం అనను గాని - అది అతి అతి. అత్యంత —

సరళ : (గట్టిగా) అక్కయ్యా ! (రైలు ప్రమాదం. పెద్ద చప్పుడు. చాలా గల్లంతు. రక రకాలగోల.)

ఆకాశవాణి రేడియో వార్తలు. గతరాత్రి రైలు ప్రమాదంలో గాయపడినవారి సంఖ్య 24. మరణించినవారి సంఖ్య ఒకటి. మరణించిన వ్యక్తి ప్రొఫెసర్ ఏ. యస్........

ఒకగొంతు : చాలు ! ఈ వార్తలు, రైలు ప్రమాదం. గాయపడ్డవారు, మరణించినవారు ! విమాన ప్రమాదం - గాయపడ్డవారు, మరణిం చినవారు ! యుద్ధ ప్రమాదం - గాయపడినవారు మరణించినవారు ! ఏదీ ఇవన్నీ మరపించే మంచి సంగీతం ! (మ్యూజిక్)

రంగా : గణితశాస్త్రరీత్యా కాలం ఆగిపోవడం సంభవమా ? అసంభవమా? ఆ అమ్మాయి వాచీ నడుస్తోందో ఆగిపోయిందో తెలియలేదే? అక్కయ్యా అని అరచి కిటికీలోంచి గెంతేసింది. నేను నిద్రపోతున్నానా ? మేలు కున్నానా ? ఇప్పుడు టైమెంతయింది ?

రైలు ఆగిపోయినట్టుందే! స్టేషనుగానీ వచ్చిందా? అంతా చీకటిగా వుందే. అరే నా వాచీ ఏదీ? చెయ్యేదీ? శరీరం యేదీ?

ఒకగొంతు: ఆ ఒక్కడైనా చచ్చిపోయుండకపోనట. షాక్‌వల్ల గుండె ఆగిపోయిందట. ఇదుగో పేపర్లోవుంది.

రంగా: నాగురించే మాటాడుకుంటున్నారు.

ఒకగొంతు: ఆ పెట్టెలోనే ప్రయాణంచేస్తూన్న అమ్మాయొకర్తె పదిగజాల దూరంలో బురదలో పడిపోయి చెక్కు చెదరలేదు.

రంగా: చేతులో రిస్టువాచీకూడా ఉందా?

ఒకగొంతు: చేతిని రిస్టువాచీ మాత్రం ఆగిపోయింది. అయితే అది ప్రమాదానికి పూర్వం ఆరుగంటలకి!

ఇంకొకరు: ఈ పేపరువాళ్ళు ఏసంగతీ వదలిపెట్టరురా!

ఒకగొంతు: ఈ చిత్రంచూశావా: ఆ పిల్లచేతిలో ఇంకో రిస్టువాచీ ఉందట. దానిముళ్ళ —

ఇంకొకరు: చాల్లెద్దూ!

రంగా: చంపేశావు! ఈసారి నేను నిజంగా చచ్చిపోయాను: ముళ్ళు తిరుగుతున్నాయా? తిరగనట్టా? ఏయ్ పేపరు చదువుతున్న మనిషీ! నిన్ను నిన్ను బతిమాలుకుంటాను. చెప్పవూ? దానిముళ్ళ —

ఒకగొంతు: మూడుముళ్ళూ పడ్డాక ఏలుకోక ఏం చేస్తాడంట?

రంగా: వీళ్ళు మరేదో ధోరణిలో పడ్డారు. లాభం లేదనుకుంటాను. అయినా అరిస్తే? - అరుస్తాదు - ఏయ్ అబ్బ!

ఒకగొంతు: ఛీ! దోమలు! ఒకటే సంగీతం. మీ యింటినిండా ఇన్ని దోమ లేమిటి?

రంగా: నేను దోమకన్నా హీనం! దోమకు ప్రాణం ఉంది నాకు లేదు. లేదని బెంగకూడా లేదు. కాని టైమెంతయిందో తెలిస్తేనా?

ఒక గొంతు: అబ్బో చాలా టైమయింది. ఇక నేనింటికి వెళ్ళాలి.

ఇంకొక గొంతు: ఏం ఇప్పుడే మంత మించిపోయింది. కాఫీ తాగిపోవచ్చు. ఒసే!

రంగా : కాఫీ తాగాలన్న తాపత్రయం ఒకటి వొదిలిపోయింది. చచ్చిపోవడంలో చాలా హాయుంది. కాఫీ ఒకటే అన్నమాటేమిటి? తిండీ తిప్పలూ అఖర్లేదు. ఇల్లూ వాకిలీ అనవసరం! బట్టలు వేసుకోవాలన్న బెడదేలేదు. నా టైం ఎప్పుడూ సమయానికి కనబడేది కాదుకదా! సమయం! సమయం! ఏమిటో జ్ఞాపకం వస్తోంది: ఏమిటె చెప్మా! ఆ(అదే! ఇదేమిటి నేనెక్కడికో తేలిపోతున్నాను? ఏమిటి జ్ఞాపకం వచ్చిందీ? ఏమో మరచిపోయాను.

(సానుభూతి సభలో)

ఉపన్యాసకుడు : సోదర – సోదరీ మణులారా! మన మిప్పుడు ప్రొఫెసర్ రంగారావుగారి మరణానికి సానుభూతి ప్రకటించే నిమిత్తం ఇక్కడ సమావేశమైనాం. రంగారావు నా ప్రాణస్నేహితుడు.

రంగా : పచ్చి అబద్ధం! వీడే కాలేజీలో నా ఉద్యోగం పోవడానికి కారణం. అందుకనే నేను కడుపుచేత్తో పట్టుకొని ఉత్తరహిందూ స్థానానికి పోయాను.

ఉపన్యా : రంగారావు మనఊరి వాడైనందుకు నేను గర్విస్తున్నాను. ఆయన ఫిలాసఫీలో నిధి! ఖండ ఖండాంతరాల కాయనపేరు వ్యాపించింది. అతని పుస్తకాలు అర్థం కావడమేకష్టం! నిజం చెప్పాలంటే నా కవి అసలే అర్థం కాలేదు! అసలు నేను రాజకీయవాదిని. జీవితమంతా దేశసేవలో వెళ్ళబుచ్చాను. నా ప్రియమైన పార్టీ నా సేవని గుర్తించి—

రంగా : నీ గొడవెవడిక్కావాలిరా నాకోసం జరుపుతున్న సభలో నాగురించి మాట్లాడవు? నా పుస్తకాలు మహా మహా వాళ్ళకే అర్థం కావు. నీకు బోధపడలేదని ఏడుపెందుకు? ఛీ! ఇహ నే నిక్కడ ఉండలేను. అంతా నటన! అంతా మోసం. జీవించినంతకాలం నేను మానవుల్ని ద్వేషించాను. మరణించిన తర్వాత ఆ ద్వేషం మరింత దృఢపడింది. మరణం ఎంత మధురంగా ఉంది! ఏ కోరికా లేకుండా చచ్చిపోవడం ఎంత హాయి! ఏ కోరికా లేదూ? లేకేం? ఒక్క కోరికమాత్రం మిగిలిపోయింది. ఆ అమ్మాయి పెట్టిలోంచి

తీసిన రిస్టువాచీ తిరుగుతోందా? ఆగిపోయిందా? ఆగిపోతే ఆరు దగ్గిరే ఆగిపోయిందా? మూడు వాచీలు ఒక్కమాటు, ఒక్కచోట ఆగిపోతాయా? ఎందు కాగి పోకూడదు? ఎలా తీరుతుం దీ సందే హం! ఆ అమ్మా యెక్కడుందో తెలిస్తే బాగుండును!

మగగొంతు : కంగ్రాట్యులేషన్సు మిసెస్ సరళా! చాలా మిరేక్యులస్‌గా ఎస్కేప్ అయేరు!

సరళ : థాంక్యూ శర్మగారూ, మీ ఆవిడ నింపాదిగా ఉన్నారా?

రంగా : ఈ ఆడవాళ్ళ కిదో జబ్బు! ఎదటివాడి పెళ్ళాం యోగక్షేమాలు భోగట్టాచేస్తారు. వాచీ సంగతి రానేరా దేమిటిచెప్మా?

శర్మ : మీ అక్కచెల్లెళ్ళ రిస్టువాచీలు - పేపర్లో కెక్కాయే?

రంగా : థాంక్యూ శర్మగారూ!

కాంతం : సరిగ్గా వాచీ పెట్లోంచి పైకి తీసింపోలేదో థాం! పెద్ద ఏక్సిడెంట్. రెక్కలొచ్చినట్టు నా కళ్ళముందే ఎగిరిపోయింది. నేను కూర్చున్న దాన్ని కూలబడ్డాను. చిన్న గాయాలు తగిలాయి.

సరళ : పాపం! రంగారావుగారిది వీక్‌హార్ట్. లేకపోతే ఆయన బతికుండే వాడే.

శర్మ : కేజూఆలిటీస్ లేకపోతే ఏక్సిడెంట్ ఏమిటి?

సరళ : వేళాకోళా లొద్దు శర్మగారూ! రంగారావుగా రంటే నా కెంతో గౌరవం. ఆయన దురదృష్టానికి నేను చాలా విచారిస్తున్నాను.

రంగారావు : ఏమీ విచారం అక్కర్లేదు. నేను నిక్షేపంలాగున్నాను. నా సంగతి కేం? ఆ వాచీమాట చెప్పు.

కాంతం : వాచీ చూడ్డానికి ముందు మామధ్య ఎంత రభస పెరిగిం దను కున్నారు! ప్రొఫెసరు వాచీ ఆరుదగ్గి రాగిపోయింది! దీని వాచీ కూడా బైఎస్ట్రేలిస్టికో ఇన్సిడెన్స్ ఆరుదగ్గిరే ఆగిపోయింది. పెట్లో వున్న నా వాచీ చూస్తానని—

సరళ : హల్లో ఫాదర్! శర్మగారూ, ఈయన మా నాన్న. నాన్నా! ఈయన బి. ఏ. లో నా క్లాస్‌మేట్ శర్మ. నన్ను కంగ్రాట్యులేట్ చెయ్యడాని కొచ్చారు.

రంగా: ఈ నాన్న ఇప్పుడే రావాలి? ఇక మళ్ళీ పీళ్ళు వాచీ సంగతి మాట్లాడరు. ఎలా తెలుస్తుంది? ఏం సాధనం?

శర్మ: క్షమించాలి! ఫోంచేసే వొచ్చాను.

రంగా: అక్కయ్యా అని అరిచిందికదా అందులోకూడా ఆరే అయిందేమో? లేక రైలుపెట్టె బోల్తా పడుతున్నందువల్ల అరిచుండకూడదూ?

శర్మ: అవునండీ అమెరికా అంటే నా కేమిటో అసహ్యం. బ్రిటన్‌లోనే చదవాలనుంది.

సరళ: శర్మగారో చిన్న పింక్ సోషలిస్టు నాన్నా!

ప్రకటన: చచ్చిపోయిన ప్రొఫెసర్ రంగారావు, చాలా సేపు అక్కడే తచ్చాడాడు. కానీ మళ్ళీ వాచీమాట ఎవరూ యెత్తలేదు. కాలం ఇందాకా నేను చెప్పినట్టు అంతా ఒకటేకాని, అందరికీ ఒకటి కాదు; మరణించిన రంగారావు జన్మించబోయే శిశువుల కాలంలో ప్రవేశించాడు.

(చల్లని నేపథ్య సంగీతం)

పిల్లలగొంతు: తాతయ్యా, తాతయ్యా!

రంగా: మీరంతా ఎవర్రా!

ఒక పిల్లడు: మేం పుట్టబోయే పిల్లలం తాతయ్యా! భూమ్మీద బతకబోతున్నాం. బతకడం ఎంతో బాగుంటుంది కదూ?

రంగా: బతకడం బాగుంటుందని ఎవరు చెప్పారు. నన్నడగండి! అరవై ఏళ్ళు బతికినవాణ్ణి. బతికడంలో వున్న బాధలన్నీ చెబుతాను.

ఇంకొక పిల్లడు: ఊపిరి తియ్యడమే ఎంతో సుఖమనీ, సులభమనీ అంటారు నిజమేనా తాతయ్యా?

రంగా: క్షయరోగం అన్న పేరెప్పుడైనా విన్నారా? ఊపిరి తియ్యడం ఎంత సుఖమో ఎంత సులభమో క్షయ రోగుల్ని అడగండి. భయంకరమైన క్షయవ్యాధికి భూలోకంలో ఏటేటా కోటానుకోట్ల మంది బలి అవుతారు. సరేనా? ఇంకో ప్రశ్న అడగండి!

ఒక పిల్లడు: బతికుంటే మంచి మంచి వస్తువులు తినొచ్చుకాదూ? రక

రకాల పళ్ళు, వేడి వేడి అన్నం. లడ్డూ, జిలేబీ, హల్వా, ఇడ్లీ, ఉప్మా, దోసె.

రంగా : ఆగవ్బాయ్ ఆగు. అజీర్ణం అన్నమాటెప్పుడైనా విన్నావ్? అబ్బ అన్ని రోగాలకి అదే మూలం. భూలోకంలో తిన్నది జీర్ణించుకో లేక బాధపడుతున్నవా ళ్ళున్నారు. తినడానికి తిండిలేక దేవురిస్తున్న వాళ్లున్నారు. తినడమూ బాధే. తినకపోవడమూ బాధే.

ఇంకొక పిల్లడు : జీవించడం అంటే ప్రేమించడం అన్నమాట. నిజమైన ప్రేమని అనుభవిస్తే, అంతకుమించిన స్వర్గం లేదంటారు నిజమేనా?

రంగా : అబ్బో! చాలా పెద్దమాట లాడుతున్నావ్. నేనోటి చెబుతాను విను? ప్రేమే కాదు, ఏ అనుభవమైనా, అనుభవించినంత సేపే ఆకర్షణ. కాని ఆ తర్వాత యాతనే అనుకోండి: అన్ని అనుభవాలూ చవిచూసిన నేను చెబుతున్నాను వినుకోండి.

ఒక పిల్లాడు : మీ రెంత తెలిసినవాళ్ళయినా, మేము స్వయంగా అనుభవించకుండా, మీ వ్యాఖ్యానాలతో ఎలా తృప్తిపడగలం తాతగారూ!

ఇంకొకడు : ఇతను చచ్చిపోయాడురా; చచ్చిపోయినవాడు బతకడంమీద మాట్లాడితే ఇలాగే వుంటుంది.

రంగా : అయితే వెళ్ళండి. పుట్టండి. ఆ భూలోకంలో పడండి. మీ అంతట మీరే తెలుసుకోండి; నేను చెబితే నమ్ముతారా? అన్ని అనుభవాలూ అయిన తర్వాత అప్పుడే తెలుస్తుంది, వెళ్ళండి. శరీరాలు ధరించండి. ఎవరి శరీరాలలో వాళ్ళు, ఎవరి కాలం పొడుగున వాళ్ళు జీవించండి. కాలం కాలం! మరచిపోయిం దేదో జ్ఞాపకం వస్తోంది. వాచీ, వాచీ! మూడో వాచీ! అందులో కాలం సాయం కాలం ఆగిపోయిందా, లేదా? ఎలా తీరుతుందీ సందేహం?

ప్రకటన : ఈ సందేహం తీరదు. రంగారావు అనంతర యాత్ర అనంతంగా సాగిపోవలసిందే.

# సుప్తాస్థికలు

పరిత్రాయణ సాధూనాం । వినాశాయచ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ । సంభవామి యుగే యుగే.

శిష్టమానవ రక్షణ సేయుకొరకు । దుష్టమానవ నాశనోద్యోగమునకు
ధర్మ సంస్థాపనము నిమిత్తము ధరిత్రి । యుగయుగమ్ముల యందు నే
నుద్భవింతు.

ప్రకటన : సుప్తాస్థికలు, నిద్రపోతున్న ఎముకలు. ఎముకలు నిద్ర పోతాయా? ఏమో. పోనీ, నిద్రిస్తాయనే అనుకుందాం. నిద్రించడం తప్ప మరేమీ చెయ్యలేవనే అనుకుందాం. నిద్రిస్తాయి కాబట్టి, కలలు కూడా కంటాయా? ఏమో ఒక కవి యిలా అన్నాడు:

కవి :

అవి ధరా గర్భమున
మానవాస్థికా పరంపరలు !
సుప్త నిశ్శబ్ద సంపుటములు !
అట నొకే దీర్ఘ యామిని ।
ఆ నిశా శ్మశాన శయ్యకు

ప్రాతః ప్రసక్తి లేదు!
ఆ యగమ్య తమో రహస్యాంగణాన
తాండవించును
మృత్యు శైత్యల్య మొకటె
అవి నితాంత హేమంత
హృదంతరంత రనుభవాళి
ఘనీభవించిన సమాధులు.
ఆ మనుష్యాస్థికలు
నిద్రలో మునింగి
సంచరించును భైరవస్వప్నవీధి
అవి చలించును తమ
చర్మ కవచ మెపుడొ
బ్రతికిన దినాల
తలపోత బరువుచేత
నా కనుంగవ కన్నీళులై కరంగు
నవి యొనర్చెడు నీరవాహ్వానమెరిగి
ఇంత శోషిల్లునేలొ
        నా హృదయ పుటము
వణకునేటికొ నా అస్థిపంజరమ్ము.

ప్రకటన: అస్థికలు, సుప్తాస్థికలు! అయితే? అదా! సుప్తి. రాత్రి. చీకటి — నిశ్శబ్దం మరణం: ఎముకలు మరణానికి చిహ్నం కాబోలు. ఎవరి మరణం, ఏమి టిదందా? ఇదంతా దేన్ని గురించి? ఏవో ఉపద్రవం సంభవించినట్లు ఏమి టా రోదననాదం? ఏం జరిగింది? అలా కొట్టుకుంటున్నాయేం మీ గుండెలు? ఏం ఘోరం? ఏం విపత్తు? ఎవరు పోయారు? ఏమి టిదంతా? ఎవరు? ఎవరో మీ ఆత్మలకన్న ఆత్మడూ ఆప్తుడూ ఎవరో మహాప్తుడో మహాత్ముడో మీకు దూరం అయిపోయాడా? ఎవరికీ కనబడకుండా ఎక్కడికో వెళ్ళిపోయాడా? ఇదంతా యేమిటి? ఎందు కీ యేడుపులు?

విషాద కంఠాలు

ఏమని చెప్పమంటావు
ఎందు కేడుస్తున్నామో ?
ఎందు కేడుస్తున్నామో
ఏమో మాకే తెలియదు !
ఏమి టిదంతా అంటావా ?
ఏమో మాకూ తెలియదు !
ఎవరు ? ఎందుకు ? ఏమిటి ?
ఇవన్నీ మాకేం తెలియదు.
ఎప్పుడు ? ఎక్కడ ? ఎలాగ ?
ఏం ప్రశ్నలయ్యా ! ఇవి ?
నోరులేని గాలి నడుగు.
అవులించిన ఆకాశాన్నడుగు !
ఔను ! ఘోరమే జరిగింది !
అనుకోనిదే నిజమయింది.
ఎందుకా ఏడుస్తున్నాం అని
ఇంకా అడుగుతున్నావా ?
ఒకళ్ళూ ఇద్దరూ కాదు
ఒక కుటుంబం ఊరూ కాదు
ఒక నగరం ఒక రాష్ట్రం కాదు
ఒక దేశం ఒక ఖండం కాదు
సమస్త ప్రపంచం నేడు
సమగ్ర దుఃఖంలో మునిగిందయ్యా
అమేయ మీ ఉపద్రవానిది
అంతర్జాతీయ పరిమాణం !
అమెరికాలో సాహుకారు.
ఆఫ్రికాలో నీగ్రో
భవనంలో మహారాజు
ఫ్యాక్టరీలో కూలీ

ఒకళ్ళూ ఇద్దరూ కాదు
వందలూ వేలూ కాదు
ధరిత్రి ఈ కొసనించి ఆ కొసకి
దద్దరిల్లిపోయింద య్యా !
ఇంకా ఏమని చెప్పమంటావు
ఎందు కేడుస్తున్నామో !
హిమాలయం మా
హృదయభారం !
గంగానది మా కన్నీళ్ళు !

ప్రకటన : ఔను ఔను, నా కర్థమవుతోంది. మిమ్మల్ని ఓదార్చ డానికి ప్రయత్నించను. అయినా ఇటు చూడండి. ఈ శ్మశాన ప్రశాంతిని! హెచ్చు తగ్గులులేని ఈ మైదానాన్ని చూడండి. మృత్యువు భయంకరమైన దని మీ ఉద్రేకం చెబుతుందేమో కాని, ఈ ప్రాంతం ఎంత ప్రసన్నమో ఒక్కసారి ఆలోచించి చూడండి! ఎవరో ఇటు వస్తున్నారు.

సంధ్య

నేను సంధ్యని
దివసమ్మునకు వమోధికల
ప్రాప్తించినది
తీక్ష్ణదీప్తు లడంగి దినరాజు
కృశియించే!
వృద్ధాహ్ణ మిడిన దీవెనచేత
జనియించి
ఔద్ధత్యమునచే అహర్పతిన్
మ్రింగితిని;
ఈ నా భవనమ్ము లోకానంద
మొసగునా?
ఏ నెప్పటికి కూడ ఇటు
వికాసింతునా?

నా కే నిముసమేని
        లేకుండునా మృతి
ఇట మాయమైన నాకెట
        సమున్మేషమో?

అంధకారం

నేను చీకటిని
ఈ దివారోచి స్సుధా
        ధామముం గూల్చి,
ప్రాదుర్భవించి నే
        బయలు దేరినయంత –
జగతి యేమోకాని
        నగవే మరచిపోయి.
వగపుచే తపియించు:
        వనటచే నిట్టూర్చి:
నా మేలిముసుగులో
        వలుపు లూరెడు నంట.
నామీద జగతి కింతయు
        ప్రేమ లేదంట :

నక్షత్రం

నేను నక్షత్రాన్ని.
నీలోత్పల నికాశ
మీ నిశీథమునుండి
ఎలుగెత్తి యేడ్తు
వెందుల కంధకారమా?

వాగులైనా ప్రేమ
        వరియించునే నిన్ను,

స్వాగత మ్మొసగు
నాశాగంధ వాయువుల్ :
నిలువలేనే నీవు
నిలిచియుండిన వేళ :
వెలుగలేనే నీవు
విస్తరిల్లని వేళ :
నీ కాటుకలచేత నా కనుల్
వికసించు :
నీకు నేనే, నాకు నీవె
ఈ లోకాన :

ప్రకటన : మృత్యువు జగద్విజేత కావచ్చును. కాని మరణాన్ని ప్రేమ జయిస్తుంది.

ఒకగొంతు : సకల ప్రాణులనూ సమానంగా ప్రేమించ గలిగిన వ్యక్తికి మరణమా ? ఇది నిజమని ఎలా నమ్మడం ?

రెండవ : పుష్పకవిమానంలోవలె అతని హృదయంలో ఎంద రధివసించినా ఇంకా స్థలం ఉండనే ఉంటుంది.

మూడవ : ఎన్ని గ్రంథాలు చదివినా మానవ మేధస్సులో ఇంకా కొత్త భావాలకి తావున్నట్లు.

బృందగీతి

చీకట్లకోటలో కన్నీటిలోయ
కన్నీటిలోయలో, కారుణ్యరేఖ.
పాపాల కోనలో
పసిపాప నవ్వు
చీకట్ల కోటలో
చిన్నారి వెలుగు
మృత్యు నిశ్శబ్దాన
మృదు జీవరవళి

ఎముకల నిద్రలో
ఇంపైన కలలు.

ప్రకటన: అదుగో! అదుగో! అటు చూడండి. భయంకర చితాగ్ని జ్వాలలనుండి పైకిలేస్తున్న ప్రశాంత తేజాన్ని చూడండి! అతని భౌతిక శరీరం అగ్ని కాహుతిఅయింది. అతని అనశ్వరాత్మ ఆకాశాల నాక్రమించింది.

బృందగీతం

అతడు సామాన్య వ్యక్తి
అత డసామాన్య వ్యక్తి
తృణం కన్నా తేలిక
మేరువుకంటే ధీరుడు!
ఆగర్భ శ్రీమంతుడు!
నిత్య దరిద్ర నారాయణుడు
వయస్సు మీరిన బడుగు,
వయస్సులేని నిసువు!
అన్యాయం సమక్షంలో
అగ్రమహోదగ్రమూర్తి
చరాచర ప్రపంచానికి
క్షమా మార్గదర్శి
అత డిప్పుడు లేడు
అత డెప్పుడూ ఉన్నాడు
అమరత్వం అందుకున్న
అతనికి మా నతులు!

ప్రకటన: అరే! ఎవరూ లేరే? ఎంత శూన్యంగా వుందో ఈ స్థలమంతా? ఏదీ చితి ఏదీ జ్వాల? ఏవీ అస్థికలు? ఏవీ బూడిద? ఏవీ లేవే? అన్ని వస్తువులూ తమ ఆకారాన్ని పరిత్యజించినట్టుందే! అంతా శూన్యాకాశం: నిర్జననిర్జీవ నిరుపాధిక నిశ్శబ్దం! (క్షణం నిశ్శబ్దం) ఈ

నిరవధిక నిశ్శబ్దంలో.........ఏమిటా గుసగుసలు. వెలుగూ చీకటీ కాని, బుద్ధికీ కంటికీ అందని ఈ విచిత్రాకాశపథంలో ఒక సోదరతార సహస్ర కోటి యోజనాల దూరంలో ఉన్న ఇంకొక సోదరీ తారతో సంభాషిస్తోంది.

౧వ తార : అక్కా ! ఒసే చుక్కా :

౨వ తార : ఏం తమ్ముడూ !—

౧వ తార : అదేమే అలా తుళ్ళిపడి లేచావూ ?

౨వ తార : ఏం లేదు. నిద్రపోదూ !

౧వ తార : మరి నువ్వేందుకు మేలుకున్నావూ ? ఎందుకే అలా వణకుతున్నావు ?

౨వ తార : ఏం లేదు పడుకుందూ. ఏమిటో నిద్రలో వినబడింది.

౧వ తార : ఏమిటే అక్కా. ఏమి జరిగిందేమిటి ? ఏం వినబడింది నీకు

౨వ తార : అబ్బ ! ఏం లేదు పోనిద్దూ !

౧వ తార : కాదే, చెప్పవే ?

౨వ తార : ఏముంది పెద్దూ. ఎక్కడో భూగోళంలో, మినుకుమినుకు మనే భూగోళంలో. సరిగ్గా కనబడీ కనబడని భూగోళంలో-

౧వ తార : ఆఁ — ఆఁ ఏమ ఉందే ?

౨వ తార : భూగోళం మీద హస్తినాపురం అనే ఊరుంది. దాని ప్రస్తుతం పేరు నాకు తెలియదు......... వింటున్నావా ?

౧వ తార : ఆఁ వింటున్నాను. హస్తినాపురం అనే ఊళ్ళో-

౨వ తార : నాలుగుసార్లు రివాల్వరు పేలుడు వినిపించింది.

1 వ తార : రివాల్వరా ? రివాల్వరంటే ఏమిటే ?

2 వ తార : రివాల్వరంటే తెలియదూ ? అటంబాంబుకి ముత్తాత.

1 వ తార : అటంబాంబు అంటే ఏమిటి ?

2 వ తార : అబ్బ ఊరుకుందూ ! నీ ప్రశ్నలకు జవాబు చెప్పలేక పోతున్నాను.

1 వ తార : పోనీలేవే. అక్కా : పోనీ, ఇది చెప్పు ! నాలుగు మోతలు వినడం వల్లనా నీకు నిద్రాభంగమయింది ?

2 వ తార : కాదు తమ్ముడూ ! వినుమరి ! ఆ రాక్షసధ్వనులు నాల్గింటిపి

మరో నాలుగు అక్షరాలూ, రెండురెళ్ళు నాలుగు అక్షరాలూ ఎదుర్కొన్నాయి! ఎంత పెద్ద యుద్ధ మనుకున్నావు? ఇప్పటికీ జరుగుతూనే ఉంది! హింసకీ అహింసయుద్ధం! అబ్బా. ఇంకా వినబడుతూనే ఉంది! ఎలా కొట్టుకుంటున్నాయో నా గుండెలు!

1 వ తార: ఏమిటే ఆ అక్షరాలు నాలుగూ?

2 వ తార: "హారాం! హారాం!" అని.

1 వ తార: అంతేనా అక్కా? అంతేనా? నాలుగుసూర్లు రివాల్వరు చప్పుళ్ళు "హారాం హారాం" అనే గద్గదస్వరాలు! అంతేకాదూ, అంతేనా?

2 వ తార: అంతే అనా అడుగుతున్నావు తమ్ముడూ! అలా ఆవలిస్తున్నావేం?

1 వ తార: అబ్బా, నిద్దరొస్తోందే!

2 వ తార: నీ కెలా నిద్దరపడుతోందిరా తమ్ముడూ?

(పరిత్రాణాయ సాధునాం....)



# విదూషకుడి ఆత్మహత్య

ప్రయోక్త: మన విదూషకుడి పేరు మందహాసం. అతనికి చిన్నపిల్లలన్నా క్రాస్‌వర్డు పజిల్స్ అన్నా చాలా యిష్టం !

ఆటంకం: విదూషకుడి పేరేమన్నారు ?

ప్రయోక్త: ఆటంకంగారూ ? తమ రిలాగ మధ్యమధ్యని అడ్డుసవాళ్ళు వేస్తూంటే, కథ సాగడం కష్టం.

ఆటంకం: నన్ను తమరించడం భావ్యంకాదు. పరాగ్గా విన్నాను. కాబట్టి మరోమాటు చెప్పండని విన్నపం చేసుకున్నాను. అది శ్రీవారి దృష్టిలో మహాపరాధంలా కనబడితే, మరి నేను మాట్లే ఆజ్ఞ.

ప్రయోక్త: నే నెవరి వాక్స్వాతంత్ర్యమూ అరికట్టేవాణ్ణీ, అపహరించే వాణ్ణీ కాను. తమరు పోనీ, నువ్వు పది ప్రశ్నలడగొచ్చు. నేను పది జవాబులు చెప్పొచ్చు. కాని చెప్పిందే చెప్పమంటే, నాకు చిర్రెత్తుకొస్తుంది. మళ్ళీ మొదలుపెడుతున్నాను. అదే ఆఖరుసారి మొదలుపెట్టడం. మన విదూషకుడిపేరు గడియారం. అతనికి టంతపిక్కలన్నా సీసపద్యాలన్నా చాలాయిష్టం.

ఆటంకం: మహాశయా ప్లేటు మార్చేస్తున్నారు. ధర్మంకాదు. ఇందాక అతని

పేరు మందహాసమనీ. చిన్నపిల్లలూ క్రాస్‌వర్డు పజిల్సూ అతనికి చెడ్డయిష్టమనీ సెలవిచ్చారు.

ప్రయోక్త: అంతా వింటూనే వినట్టు నటించే నిన్నేమనాలి? మందహాసం అన్నా, గడియారం అన్నా ఒకటే అని ఎందుకర్ధం చేసుకోకూడదు?

ఆటంకం: బహుశా గడియారం అనేది ఇంటిపేరై వుంటుంది.

ప్రయోక్త: ఉండదని నే నంటున్నా. కాదంటే నీ కథ నువ్వే చెప్పుకో. హన్నా పెంకితనం.

ఆటంకం: లేదు. లేదు. తమ రాగ్రహిస్తే ప్రపంచం భస్మమైపోదుగాని. నాటకం ఆగిపోతుంది. కానీండి స్వామీ వింటున్నాం. ఈ సారి అడ్డంరాను. రెండో ఆఖరిసారి మొదలెట్టండి. అదే కడసారి ఆఖరిసారి.

ప్రయోక్త: మన విదూషకుడి పేరు కుతూహలం, అతనికి మందహాసా లన్నా, గడియారాలన్నా మహాయిష్టం.

ఆటంకం: మహా (అ.) యిష్టం?

ప్రయోక్త: వ్యాకరణంలో అయితే మహా అనిష్టం అనేవాణ్ణి. ఆమాత్రం వ్యాకరణం తెలియదూ?

ఆటంకం: మహాయిష్టం ఏ సమాసం సార్?

ప్రయోక్త: సంకర సమాసం. ఒప్పుకున్నాం. కాని చెవికి బాగుంది. అందరికీ అర్థమవుతుంది.

ఆటంకం: ఒప్పుకున్నాం అని తప్పుకున్నారు. అదే బాగులేదు. కాని ఈ దంతకాష్టం సంగతి చెప్పేరు కారు.

ప్రయోక్త: ఏ దంతకాష్టం? ఈ రాత్రిపూట దంతకాష్టం గొడవెందు కొచ్చింది?

ఆటంకం: మీ రిప్పుడు చెపుతున్న ఆసామీ సంగతి. మీ రతనికి మూడు పేర్లిస్తే, నేను నాలుగోపేరు పెట్టాను. మందహాసం వురఫు గడియారం వురఫు కుతూహలం మన విదూషకు డవుతాడు? ఆఖరికి ఆత్మహత్య చేసుకుంటాడా? అది మొదట చెప్పండి.

ప్రయోక్త : అతను ఆత్మహత్య చేసుకోడం అప్పుడే అయిపోయింది.

ఆటంకం : ఎప్పుడు? ఎప్పుడు? నేను వినలేదే?

ప్రయోక్త : నువ్వు వినకుండా ఎన్నో గానసభలు జరిగిపోయాయి. హరికథలూ. యక్షగానాలూ అయిపోయాయి. నువ్వు వినగలేదని రైల్వే ప్లాట్‌ఫారాలమీద వీడు కొలుపులూ, శాసన సభలో చర్చలూ, పబ్లిక్ టెలిఫోనులో ప్రైవేట్ సంభాషణలూ ఆగిపోలేదు. "మృచ్ఛకటికం" అన్న పేరు విన్నావా?

ఆటంకం : విన్నానుగాని మీ ప్రసంగానికీ, ప్రస్తుత సందర్భానికీ శుద్ధి మాత్రం సిద్ధించలేదని ముకుళితకరాలతో నేకాక, ముక్తకంఠంతో కూడా ఘోషించడం మానలేకపోతున్నాను.

ప్రయోక్త : మానొద్దు. అవశ్యం ఘోషించు. ఏమన్నావూ ? ప్రస్తుతంగా అసందర్భంగా వుంది నా ప్రసంగం ?

ఆటంకం : అవును. కావాలని శకారుడిలాగ మీరు మాట్లాడదలుచుకుంటే తప్ప.

ప్రయోక్త : నన్నుకూడా నువ్వు నువ్వే అను. మీరు బహువచనం. నేను ఒక్కమనిషినే. ఏకవచనం చాలు.

ఆటంకం : గౌరవార్థకం.

ప్రయోక్త : తేనీటి విందు. దానికేం. ఈ మృచ్ఛకటికం ఉందే –

ఆటంకం : ఉంది.

ప్రయోక్త : ఉందీ ?

ఆటంకం : ఉంది. ఉన్నది. ఉన్నయది. ఉండినయది.

ప్రయోక్త : ఉండినయదియ కాదు ఉండెడునదీయును ! అన్నటికీ ఇన్నటికీ ఎన్నటికీ కూడా.

ఆటంకం : మీరు – కాదు నీవు. మాటలాడుచున్నయది తెనుగే యటందువా ?

ప్రయోక్త : దయచేసి నా మాటల్లో చెప్పు పట్టడం మానేద్దూ.

ఆటంకం : వ్యాకరణం గొడవ మొదలెత్తింది ఎవరు ?

ప్రయోక్త : మొదలెత్తితేనేం ? పిదప దించెయ్యకూడదా ?

ఆటంకం : సరే దించేదాం : ఉభయులం ఇందుమూలంగా యావన్మందికీ తెలియచేసే దేమిటంటే –

ప్రయోక్త : యావన్మంది ! కర్ణకఠోరమైన అపశబ్దాలు కావాలని వాడుతున్నావు. శుక్రాక్షి కళేభరాన్మృగపతీ !

ఆటంకం : త్రైలోక్య ధామోదరా. యావన్మంది నికార్సైన జాతీయం. తెలుగువాళ్లు యావన్మందీ యావన్మందీ అని వాడుతారు. మనం జపం విడిచి లొట్టలువెయ్యడం మానేద్దాం(వాం ? వద్దా ? విషయం విదూషకుడి ఆత్మహత్య. దానికీ, మనం మాట్లాడుతున్నదానికీ యెక్కడా లంగరందలేదు.

ప్రయోక్త : పోనీ ఈ సారి మళ్ళీ తొలినుంచీ ప్రారంభించనా ?

ఆటంకం : వొద్దు. ఆఖరిసారి నువ్వు ప్రారంభించడం అయిపోయింది. నేను ప్రారంభిస్తే, అది మొదటిసారి అవుతుంది.

ప్రయోక్త : అదే ఆఖరిసారి కూడా కావాలి. ఆరంభించు.

ఆటంకం : అలాగే అంతా వినండయ్యా. సైలెన్స్ కామోష్. తెలుగులో అయితేష్. (తలుపు తట్టిన చప్పుడు) ఏమి టా చప్పుడు.

ప్రయోక్త : ఎవరో తలుపుకొడుతున్న చప్పుడు.

ఆటంకం : ఇంకా ప్రారంభించలేదు. ష్. కామోష్. (చప్పుడు ఆగుతుంది.) విదూషకుడి ఆత్మహత్య. రేడియో నాటకం. టెలిఫోను సంభాషణ. మృచ్ఛకటికటికం. ఏకవచనం. బహువచనం.

ప్రయోక్త : నువ్వంతా పాడు చేస్తున్నావు. ఇది రేడియో నాటకమని ఎవరన్నారు ?

ఆటంకం : నేనే, నిజం చెబితే నిష్ఠూరం. హాస్యానికైనా అబద్ధా లాడకూడదు.

ప్రయోక్త : ఇది రేడియోనాటకమే అనుకో, కాని ఇంకా ప్రారంభం కాలేదు.

ఆటంకం : ఇంకో అబద్ధం. అప్పుడే ప్రారంభమై అయిదు నిముషాలు దాటింది. అదుగో గడియారం :

పిలుపు—సత్యం : గడియారం! గడియారం :

తలుపు : (తట్టిన చప్పుడు)

ప్రయోక్త : నాటకం ప్రారంభమయింది. గడియారంగారి ఇంటి ముందర నిలబడి యెవరో ఇద్దరు తలుపు తడుతున్నారు.

ఆంజనేయులు : తలుపు తలుపు. (చప్పుడు)

సత్యం : ఏమండో గడియారంగారూ.

పొరుగింటావిడ : (మారపు గొంతుక) వాళ్లెవరూ ఊళ్ళో లేరండి. ఇల్లు తాళం వేసుకొని ఏ వూరో వెళ్ళారు.

ఆంజనేయులు : తాళం అంటుంటి. లోపల గడియ వేసుంటే.

ఆటంకం : ఎవరావిడ ?

ప్రయోక్త : పొరుగింటావిడ.

సత్య : ఎవరూ లేరంటూందేమిటి ? లోప లెవరో ఉండితీరాలి. తలుపు తలుపు. (దబదబా చప్పుడు)

పొరుగింటావిడ : గడియారంగారు పెళ్ళాం పిల్లలతో నిన్న సాయంత్రం, రైలు కెళ్ళారు. మీ రెంత పిలిచినా ఎవరూ పలకరు. తలుపు తాళం కనబడదు ?

ఆంజనేయులు : తలుపూ ? తాళం ? లేదంటే ?

ఆవిడ : తాళం లేమా ? (సమీపించి) రాత్రికి రాత్రి మళ్ళీ వొచ్చాశారేమిటి చెప్మా. ఊరికెళ్ళడం మానేసి ? ఈ గడియారం ఒక విడ్డూరపు మనిషి. (తలుపు తడుతుంది) శాంతమ్మా, శాంతమ్మా.

సత్యం : ఇంట్లో అలికిడేమీలేదు !

ఆవిడ : నెళ్ళాళ్ళదాకా రానని చెప్పి మరీపోయారు. అప్పులవాళ్ళ బాధల్లా తప్పించుకుందామని లెండి. పాపం చాలా హింసపడ్డారు. ఎవరికైనా వస్తాయి కష్టాలు. కాని వీళ్ళలాగా బాధలు పడుతున్నవాళ్ళ నెక్కడా చూడలేదు. పదేళ్ళనించి ఎరుగుదును కదా. ఒక్కనాడైనా వాళ్ళు సుఖంఅంటే ఏమిటో ఎరగరు. ఏడాదికిందట రెండో అబ్బాయి చనిపోయినప్పుడు పాపం శాంతమ్మ మంచంపట్టి ఇప్పటికీ

తేయకోలేదు. ఎలా కాలక్షేపం చేస్తోంవో ఇంత దరిద్రంలో. పగవాడికైనా వొద్దుబాబూ అలాంటి కష్టాలు.

ఆటంకం : నీకన్న నయం. నిమిషంలో గడియారం సంసారం కథంతా పూసగుచ్చినట్లు చెప్పేసింది. నువ్వు నీళ్ళు నములుతూ చిన్నపిల్లలనీ సీసపద్యాలనీ ఒహతకి తెమిల్చేవి కావు.

ప్రయోక్త : అందుకే ఆడవాళ్ళని అన్ని ఉద్యోగాలలోకి ఆదరించి తీసుకుంటున్నారు.

సత్యం : ఆంజనేయులూ మరిప్పు డేం చేద్దాం ? ఇంట్లో తలుపేసుక్కూచున్నాడు. ఎంత పిలిచినా పలకడు.

ఆంజనేయులు : నిద్రపోతున్నాడేమో ?

సత్యం : పొద్దెక్కిపోయినా ఏమిటా మొద్దునిద్దుర.

ఆవిడ : మీక్కూడా ఏవైనా బాకీవున్నాడా గడియారంగారు ? తెల్లారేసరికొచ్చిపడతారు - ఎక్కడలేని అప్పులవాళ్ళూ. ఒక్కొక్కప్పుడు గడియారం నాలుగైదు రోజులు కనబడకుండా మాయమైపోతూ వుంటాడు. ఇంట్లో దమ్మిడీయేనా ఇచ్చివెళ్ళడు. ఇవ్వడాని కేమయినా వుంటేనా ? మాలాంటివాళ్ళం అడపా దడపా ఆదుకుంటేమాత్రం ? ఎంతో ప్రాణంమీదకొస్తే తప్ప ఇరుగింటి గుమ్మంతొక్క దావిడ. ఏ రోజు కా రోజు వొచ్చేపోయే యములాళ్ళకి జవాబులు చెప్పలేక పాపం ! ఆ ఇల్లాలు సతమతమైపోతూవుంటుంది.

ఆంజనేయులు : శాంతమ్మ మా చెల్లెల్లేనండి.

పొరుగింటావిడ : శాంతమ్మ అన్నగారా మీరు. క్షమించండి. తెలియక ఏవేవిటో నోటికొచ్చిందల్లా వాగేశాను. అన్నట్టు, శాంతావాళ్ళు మీ ఊరికే బయలుదేరి వుండాలే.

ఆంజనేయులు : ముందుగా ఉత్తరమ్ముక్కైనా రాసిపారేశాడు కాడు. దౌర్భాగ్యుడు.

సత్యం : ఇంటిల్లపాదికి రైలుటిక్కెట్లకి పొయ్యకపోతే, ఆ డబ్బుతో కొంత అప్పు తీర్చుకోవచ్చునే ?

ఆవిశ : అవి తీరే అప్పులు కావండి. గడియారం ఈ వీధంతటికీ బాకీ, ఈ వూరంతటికీ బాకీ. అలాగని ఆయనకి దురలవాట్లేవీ లేవు సుమండీ – నాటకాల్లో వేషాలువేసే తతిమ్మా వాళ్ళందరిలాగ.

ఆటంకం : ఈ తలుపులదగ్గర పాట ఇంతటితో పూర్తయ్యేటట్టు లేదు, నువ్వెక్కడి ప్రౌఢ్యాసరివయ్యా! ఇంతసేపు సస్పెన్సు నిలుస్తుందీ? ఆ ఇంట్లో విమాషకుడు చచ్చిపడివున్నాడని ఈపాటి కందరికీ తేలిపోయుంటుంది. వేగిరం తలుపులు బద్దలుకొట్టించు. ఉరిపోసుకుని వేలాడుతూవున్న విమాషకుణ్ణి చూసి, పౌరిగింహావిద వేసే గావుకేకకి మైక్ బద్దలైపోవాలి! అదీ డ్రామా అంటే. గాలి పోగుచేసి నాటకం వేసేస్తే సరా.

ప్రయోక్త : క్వయిట్ ప్లీజ్! గంగాధరం ఉరిపోసుకుని చచ్చిపోయాడని నీ కెవరు చెప్పారు? విషం తాగాడు.

ఆటంకం : కొత్తగా ఈ గంగాధరం ఎవరు?

ప్రయోక్త : విమాషకుడు. నేను సృష్టించిన పాత్రకి నా యిష్టం వచ్చిన పేరు పెడతాను. ఇష్టం వచ్చినన్ని పేర్లు పెడతాను.

ఆటంకం : నే నెవరి నడగడానికి? అంతేనా, సాధారణంగా లోకంలో ఒక మనిషికి ఒక పేరుండడం రివాజు.

ప్ర : నువ్వు చూసింది చాలా చిన్నసైజు లోకం అయ్యుంటాలి. మన్మధుడి కెన్ని పేర్లో తెలుసునా?

ఆటంకం : మన్మధుడిది మనలోకంకాదు.

ప్ర : తెలుగుకి పర్యాయ పదాలు తెలుసా?

ఆటంకం : అది భాష. నేను మాట్లాడేది మనుష్యుల సంగతి.

ప్ర : కొండడూ, కరుణాకరుడూ, పురుషోత్తముడూ తెలుసా.

ఆ : అది సినిమా.

ప్ర : ఇది రేడియో.

ఆ : అంచేత లైసెన్స్.

ప్ర : సైలెన్స్. పౌర్ణింహావిడి వెళ్ళిపోయింది.

ఆ : ఔను పాపం. ఎంతసేపని పరాయిమొగాళ్ళతో నడివీధి నిలబడి మాటాడుతుంది.

ప్ర : అనవసరంగా ఆవిడ శీలమ్మీద అక్షింతలు వెయ్యకు. ఇలాంటి దుర్మార్గపు కూతలు ఆ యిల్లాలు చెవినిపడితే, యేమను కుంటుంది ?

ఆ : కన్యాశుల్కంనుంచి కాపీ కొట్టావనుకుంటుంది.

ప్ర : బ్రావో, వారెవా, జాపురే, జాగాఅన్నావు. కన్యాశుల్కం అంటే జ్ఞాపకం వొచ్చింది. ఇందాకా మృచ్ఛకటికం మాటెత్తాను. ఎందుకో ఎరుగుదువా ?

ఆ : ఏమో నా కేం తెలుసు.

ప్ర : మన కోలాహలం ఆ నాటకంతోనే మొదటిసారిగా పైకొచ్చాడు.

ఆ : అయిదు.

ప్ర : అయిదూ. ఏమిటైదు, అవాలా ? వోట్లా ? కర్పూరపు దండలా ?

ఆ : దండలుకావు. పేర్లు. విదూషకుడి పేర్లు, కోలాహలం అయిదు. దంత కాష్టం కూడా కలుపుకొంటే ఆరు.

ప్ర : ను వ్విచ్చిన పేరుగాని, సవరణగాని నే నుపయోగించను.

ఆ : పోనీ, అవన్నీ నాకే మిగులు. తరవాత ఏమైంది ?

ప్ర : తరువాత ? దేని తర్వాత ?

ఆ : అట్టహాసం మృచ్ఛకటికంతో పై కొచ్చిన తర్వాత.

ప్రి : అట్టహాసం అంటే మందహాసం అనేనా నీ ఉద్దేశం ! నా విదూష కుడికి నీ పేరేదీ ఆశించొద్దని చెప్పలేదురా ? అయిదుపేర్లిచ్చాను కదా వాటిలో ఏదయినా వాడకూడదా ?

ఆ : గడియారం వాడుకోవచ్చునా ?

ఆంజ : గడియారం గడియారం. తలుపు గట్టిగా తొయ్యరా సత్యం. మీది గడియ వెయ్యనట్టుంది. అడుగు గడియ ఒక్కటే వేసుంది. (తలుపు తెరచుకున్న చప్పుడు)

ఆ : అంతట విదూషకుడు మరణించి ప్రవేశించును. (స్టాప్ అండ్ శాడ్ మ్యూజిక్)

పరి : ఇక నువ్వు మాట్లాడ్డం మానేసి రంగు కడిగేసుకోవచ్చు. వేళా కోళాలవేళ దాటిపోయింది. మరణం సమక్షంలో వినయం అవసరం. (ఆంజనేయులూ, అతని స్నేహితుడూ ఇంట్లో ప్రవేశించి విషం తాగి చచ్చిపోయ్యున్న విదూషకుణ్ణి చూశారు. విదూషకుడు చనిపోవడానికి ముందు రాసిపెట్టిన ఉత్తరం వాళ్ళకి కనబడింది.)

ఉత్తరం : (విదూషకుడి గొంతుకతో) మై డియర్ ఆంజనేయులూ ! నేను నిష్క్రమిస్తున్నాను. ఇవాళ నేను పుట్టిన రోజు; అందుచేత పోతున్నా. (ది మ్యూజిక్ కంటిన్యూస్.) మరణానికి ఇవతల వేపున్నంతకాలం నేను, చిరునవ్వుని ఆరాధించాను. చిన్నప్పుడు మృచ్ఛకటికంలో వేషం వేసింది మొదలుకొని, మొన్నరాత్రి కన్యాశుల్కంలో బైరాగి వేషం వేసినదాకా. లోకాన్ని నవ్వించడానికే ప్రయత్నించాను. కొంతవరకు కృతార్థుణ్ణయానేమో కూడా–బైరాగి వేషంలో ఉన్నప్పుడు నా కీబుద్ధి పుట్టింది. ఖేచరీ గమనం మీద పోదామని, సరిగ్గా ఏ క్షణంలో ఈ నిశ్చయానికి వచ్చానో చెప్పనా ? బైరాగి దొంగ సాక్ష్యం చెప్పడానికి ఒప్పుకొని ఒక మాటంటాడు. వెర్రి ! వెర్రి ! నిజమేమిటి ? అబద్ధమేమిటి ? లోకమే పెద్ద అబద్ధ"మని. అప్పుడు తెరపడిపోతుంది నే నా మాటన్నప్పుడు నిజంగా చెడ్డ బాధ పడ్డాను. నేను దొంగసాక్ష్యం చెప్పలేను కాని, బైరాగిగా ఆ మాటలంటున్నప్పుడు, ప్రేక్షక జనం అంతా గొల్లుమని నవ్వారు. ఎంత నవ్వించాను వాళ్ళని. కాని వాళ్ళెవ్వరికీ తెలియదు. నా నిలువునా హాలాహలాజ్వాలలు రేగిపోతున్నాయని ! ఆ క్షణం ఎంత భయంకరం. ప నన్నీనిశ్చయానికి కొరడాకొట్టి తోలినక్షణం ? నా జీవితంలోని వ్యత్యాసం నాకర్థమయింది. నే నెంతయేడిస్తే లోకం అంత నవ్వుతుందని – నాటకరంగం మీద విదూషకుణ్ణి – లౌకిక రంగంలో విషాద జీవిని. ఆంజనేయులూ : ఇవాళ నా పుట్టిన రోజు. ఏడాది క్రిందట ఈ రోజున కలకత్తాలో ఆంధ్రసంఘం వారు నాకు అఖండ సన్మానం చేశారు. నేను మాసిపోయిన గుడ్డలతోనూ, గడ్డంతోనూ మహాసభలో నిలుచున్నాను. జీవిత కాలమంతా మాసిపోయిన, చినిగిపోయిన గుడ్డలు ధరించడం ఎలాంటిదో నీకు

తెలుసునా ? అవ్వి వేసుకుని కనబడ్డ మనిషిని లోకం ఎలా చూస్తుందో తెలుసా ? ఒకప్పుడు నేను అలుగుడ్డలతో అందరి ఎదుట కనబడ్డానికి సిగ్గుపడేవాడిని. ఏదో అపరాధం చేసినట్టు వీధిలో అణగారి పోయి నడిచేవాణ్ణి. కాని తర్వాత తర్వాత వాటినే నేను నా కవచం కింద జమకట్టుకున్నాను. ఈ చిరిగిపోయిన కవచంమీద లోకం చూపుల బాపులు నిష్ప్రయోజనంగా నేలకి రాలిపోయేవి. నేను పరాజయం నోట్లోంచి జయాన్ని లాక్కున్న విజేతని.

ఆంధ్ర సంఘం నా సామర్థ్యాన్ని సన్మాన పత్రంలో శ్లాఘించింది. కాని యేంలాభం, "ఆంజనేయులూ !" నాకు బతకడం చాత కాలేదు. నే నందరిని నవ్విస్తూ, "అందరు నవ్వుతున్నందుకు" ఆగ్రహించే వాడిని. ఒక్క క్రిందటి సంవత్సరమే నేను యిరవై ఎనిమిది నాటకాలలో నటించాను. ఒక్క దమ్మిడీ కూడ కళ్ళ చూడలేదంటే నమ్ముతావూ ? ఎందువల్లనో నా నటనని అమ్ముకోవడం నాకు మనస్కరించదు. "పరమ పవిత్రమయినదిగా దీన్నెంచుకుంటూ" బజారులో యెలా అమ్మగలను చెప్పూ. ఇంకో రహస్యం కూడా వెల్లడించనా ? తతిమ్మా అన్ని విషయాల్లోనూ ఎంత వినయంగా ఉంటానో నటన విషయంలో నే నంతగర్విని. నా నటనకి సరిపడ్డ మూల్యం ఇచ్చుకొనే శక్తి ఈ లోకానికి లేదని నా గర్వం. అంచేత దీన్ని కారుచవగ్గా అందరికీ పంచేస్తున్నాను.

ఆంజనేయులూ, నీ చెల్లెల్నీ, పిల్లల్నీ నిన్న సాయంత్రం మీ వూరు పంపించేశాను. ఈ ఉత్తరం ఎవరు చూసినా నీ కంద జేస్తారని నమ్ముతున్నాను. నేను నిస్సహాయంగా వొణుకుతున్న చేతుల్తో ఆకాశానికీ, గాలికీ నమస్కరించి వెళ్ళిపోతున్నాను. ఒక్కసారి వెనక్కు తిరిగి నా యేభై యేళ్ళ జీవితాన్ని చూసుకుంటే, నా క్కనబడు తున్నది, అమాయకత్వపు ఆకుపచ్చదనం ఒక్కటే.— అదేనా స్పష్టంగా కాదు. నిరవధిక మయిన నా యాభై యేళ్ళ నిరాశ మధ్య. ఆనంద సమయాలేవైనా అనుభవించానా అని ఇప్పు డాలోచిస్తే దుఃఖానికి, సౌఖ్యానికి మధ్యవున్న సన్నని సరళ రేఖ కరిగి పోయి, కరిగిపోయి అంతా అనంత వైశాల్యంగా కనబడుతోంది.

ఇందులో నేను రంగస్థలం మీద విదూషకుడుగా నిలబడి లోకాన్ని నవ్వించడానికి పడ్డ బాధా, పరమ దరిద్రంలోనహా అమిత వేగంతో ఎదుగుతూన్న నా పిల్లల్ని చూసుకుంటూ ఉంటే కలిగే - సంతోషమూ, ఒక్కలాగే కనబడుతున్నాయి.

ఆ : ఈ రంగం ఉత్తరాని కిక అంతం అంటూ లేదేమిటి ?

ప్ర : మళ్ళీ అడ్డొచ్చావ్. నిన్ను వెళ్ళిపొమ్మని చెప్పానే.

ఆ : ఎక్కడికి పోతాను, ఈ సుఖదుఃఖాల సమచతురస్రపు వైశాల్యాన్ని వదలిపెట్టి.

ప్ర : ఎక్కడైనా పో, ఎడారిలోని గుడారంలోకి. కన్యాశుల్కంలోని పంచమాంకంలోకి. తురుపు మణీలాకి ఇస్పేటాసుకి మధ్యనున్న ఇరుకు స్థలంలోకి. బస్సు స్టాండువద్ద, రేషన్ షాపుముందు, సినిమా హాలు దగ్గర క్యూలో నిలు. జూలో కలు. యెక్కడైనా పో ఇక్కడ మాత్రం వద్దు.

ఆ : కొంచెం సేపు ఆ విదూషకుడి పాత్ర నన్ను అభినయించనిస్తే ఇంత కన్న రసవంతంగా ఆత్మహత్య చేసుకుంటానని హామీ యిస్తా.

ప్ర : స్వామీ, మీ హామీ యేమీ మా కక్కరలేదు. నాటకం సాగకుండా ఆటంకం యేమిటి ? దయచేసి ఆ నువ్వు దయచేస్తే సంతోషిస్తా.

ఆ : నేను దయచేసే వున్నాను. ఇక దయచెయ్యను. ఒక్క రవంత సేపు నన్ను బతికున్న విదూషకుడిగా ప్రవర్తించనియ్యమని ప్రతిమాలుకుంటున్నా.

విదూ : నా పాత్ర మరొడు నటిస్తే ఒప్పుకోను.

ఆ : నువ్వు చచ్చిపోయావు. కాబట్టి మాటాడ్డానికి వీల్లేదు. నువ్వొక్కడివే విదూషకుడివైనట్లు మాటాడతావేమిటి ?

విదూ : ఈ నాటకంలో నేనొక్కణ్ణే విదూషకుణ్ణి.

ఆ : అయ్యా. ప్రయోక్తగారూ, చూశారా యీ అరాజకం. ఊరుకోబెడతారా లేదా ?

విదూ : నేను వాచీని కాను గడియారాన్ని.

ఆ : ఇంత అసందర్భపు నాటకం నే నెక్కడా చూడలేదు. అయినా ఆఖరి

దాకా ఆగడం మానలేను. విదూషకుడి ఆత్మహత్య ! అంతా దగా. విదూషకుడూ లేడు.

విదూ : ఉన్నాను. ఆత్మహత్య కూడా చేసుకున్నాను.

సత్య : స్వయంగా అతనే చెబుతూఉంటే నమ్మకపోవడం తప్పు.

ప్ర : నాటకం ముగిసింది.

ఆ : నాకు నమ్మకంలేదు. నాటకం ముగిసినట్టు ఏమిటి నిదర్శనం ? గడియారాన్ని గంట కొట్టేయమను. లేదా ఆంజనేయుల్ని భరతవాక్యం పాడమను. కాదా పొరిగింటావిడని మంగళహారతి పట్టమను.

ప్ర : నేను నాటకం అయినదని చెప్పాను. మీరింకా ఆడితే నా పూచీ లేదు.

ఆ : నువ్వెంత ప్రయోక్తవైనా నాటకాన్ని మధ్యలో ఆపేయడానికి నీకు హక్కులేదు. ఏమంటావు ఆంజనేయులూ ?

సత్య : ఆంజనేయులు వెళ్ళిపోయాడు.

ఆ : ఏమంటావు చిదంబరం ?

సత్య : చిదంబరం అనే మనిషెవడూ ఇక్కడ లేడు.

ఆ : లేకపోతే ప్రవేశపెట్టండి. లేకపోతే ఈ గడియారానికే అదింకో పేరనండి. ఏంచైనా చెయ్యండి. కాని నాటకం ఆగడానికి వీల్లేదు. ఇక్కడ – ఇప్పుడు విదూషకుడి ఆత్మహత్య జరిగి తీరవలసిందే.

విదూ : అదెప్పుడో జరిగిపోయింది.

ఆ : నే నరగంట సేపటినుంచి చూస్తున్నాను. ఇక్కడెవడూ ఆత్మహత్య చేసుకోలేదు. నువ్వాబద్ధం ఆడకుండా చెప్పు. బైరాగిలాగ దొంగ సాక్ష్యం చెప్పావంటే ఒప్పుకోను.

విదూ : వొద్దు.

ఆ : అయితే నిజం చెప్పు.

విదూ : ఔను.

ఆ : ఔను. ఏఁవిటౌను ? నువ్వుబతికున్నట్టా ? చచ్చి లేనట్టా ?

విదూ : బతికి చచ్చిపోయాను. చచ్చి బతికిపోయాను.

ఆ : ఇలాంటి పేచీలు నాదగ్గర పనిచెయ్యవు. నేను చూస్తుండగా యెవరో ఒకరు చచ్చిపోవాలి. అంతదాకా నాటకం అయిందని నే నొప్పుకోను.

ప్ర : హా ! (చచ్చిపోతాడు)

ఆంజ : ప్రయోక్త ఆత్మహత్య చేసుకున్నాడు.

ఆ : అంతటితో నా ఆటంకం తీరిపోయింది. ఇప్పుడు నాటకం అయిపోయిందని ఒప్పుకున్నాను.



# గ్రామఫోను రికార్డుల తిరుగుబాటు

సూత్రధారుడు :

రేడియోవాళ్ళం మేము ఎంత జాగ్రత్త పడుతున్నా మానవమాత్రులం కాబట్టి ఒకప్పుడు కాకపోతే ఒకప్పుడు అనుకున్న కార్యక్రమం అనుకున్నట్లుగా నడవదు. ఏదో ఒక విపరీతం సంభవించి కార్యక్రమం తలకిందులవుతుంది. ముఖ్యంగా నాటకాలు వేసేటప్పుడు గ్రంథకర్త సకాలానికి నాటకం వ్రాసి ఇవ్వకపోవడం మొదలుకొని ప్రధాన పాత్రధారి సమయానికి జబ్బు పెట్టుకోవడందాకా ఎన్నో అనుకోని అవాంతరాలు బయలుదేరవచ్చును. అటువంటి ఇబ్బందులేవీరాకుండా ఈ "తుదిపలుకులు" అనే నాటికను ముందే రికార్డుచేసి ఉంచాము. ఇప్పుడు వెయ్యబోయేది మొదటి రికార్డు మొదటిపక్క. ఉపోద్ఘాతం అనవసరం. సావధానంగా వినండి.

(ఒక రికార్డు వేస్తాడు. భయపడుతూ పొరపాటు జరిగిందని గ్రహిస్తాడు. రికార్డు ఆపివేస్తాడు)

ఉపోద్ఘాతం అనవసరం అన్నాను. పొరపాటు. పొరపాటు జరిగినప్పుడు ఒప్పుకోవలసిందే. "తుదిపలుకు"కు తొలిపలుకు అవసరమయింది. నాటకం మీరే వింటారు. మంచి చెడ్డలు మీరే నిర్ణయించుకుంటారు. అప్పుడప్పుడు కార్యక్రమం అనుకోకుండానే మారిపోతుందన్నానే, అటువంటి

సందర్భాలలో వినేవాళ్ళ అదృష్టాన్నిబట్టి మొదటిదానికంటెకూడా, మారిపోయిన కార్యక్రమమే రక్తి కడుతుంది. అంటే ఇప్పుడు నేను అదృష్ట పరీక్ష చేస్తాననికాదు. తప్పకుండా ఇప్పుడు వేసేది "తుదిపలుకు" నాటకమే. ఇక నిరభ్యంతరంగా వినండి.

(ఇంకొక రికార్డు వేస్తాడు. విలక్షణమైన సంగీతం. కారణం: విరిగిన రికార్డు)

సూ త్ర ధా రు డు

(రికార్డు ఆపి) మీ రసాస్వాదనకు అడ్డువచ్చినందుకు క్షమించండి. రాక తప్పిందికాదు. ఈ సంగీతానికి కొంచెం వ్యాఖ్యానం అవసరమయేటట్లు ఉంది. ఇది నవీన సంగీతం. రాగం, తాళం లయ, శ్రుతి అన్నీ సరికొత్తరకానివి. ఇది సూచిస్తుంది కాని ఆవరించదు. కాని ఆ సూచనకు ఆవరణలు లేవు. సంగీతం మరపింపకూడదు. జ్ఞాపకం చెయ్యాలి. ఈసంగతి మాత్రం మరచిపోకండి. మరి వినండి.

(ఇంకొక రికార్డువేస్తాడు. ఈ సారి అరవపాట. ఆపివేస్తాడు.)

సంగీతానికి భాష ప్రతిబంధకం కాదని ఋజువు చెయ్యడానికి ఇందులో అరవమాటలు చొప్పించినట్లు మీకు వేరేబోధపరచ నక్కరలేదు. నాటకంలో మొదటిభాగం అంతా ఇలాగే అమోఘమై అగమ్యగోచరమైన సంగీతంతో నడుస్తుంది. వినూత్న భావాలతో నిండిన ఈ సంగీతం సుశిక్షితం కాని చెవులకు కఠోరంగా వినబడవచ్చును. అందుకే ఇందలి విశిష్ట మాధుర్యాలను విశదం చెయ్యడానికి మధ్య మధ్య నేనుజోక్యం కలిగించుకోవడం తప్పనిసరి అవుతోంది. సాధ్యమైనంతమట్టుకు సంగీతాన్ని ముందుపెట్టి నేను వెనుకనే ఉండడానికి ప్రయత్నిస్తాను, వినండి.

(ఇంకొక రికార్డు వేస్తాడు. శ్రావ్యమైన ఫిడేలువాద్యం. కాని ఎంతోసేపు సాగదు. ఇదికూడా విరిగిన రికార్డే. విరిగిన ఫిడేలుగానం, ఆపుతాడు.)

భేష్, సెబాస్, ఇదే సంగీతం. సంగీతం అంటే ఇలాగే ఉండాలి. అడ్డురాక పోదామనుకున్నానుగాని మళ్ళీ తప్పిందికాదు. నేననుకున్నట్టే

అయింది. శ్రావ్యంగా ప్రారంభించి అల్లకల్లోలం లోనికి మెల్ల మెల్లగా ప్రవేశిస్తుందనుకున్నాను. అలాగే అయింది. ఇకమీద ఈ సంగీతం అగాధ మయిన మనఃప్రపంచపు లోతులను వెదకి వెదకి వాయువీధులను విచలితం చేస్తుంది.

ఏ కళాశీలి ఊహించాడోదీన్ని! ఇందులో సౌందర్యాలు వ్యక్తా వ్యక్తంగా మాత్రమే స్ఫురిస్తాయి. ఏమిటా మేఘం? ఏమిటా వింతమృగం. దానిని నేను వర్ణించలేను. ఇంకొకసారి వినక తప్పదు.

(రికార్డు రెండవపక్క విరిగిపోయిన చోటనే వేస్తాడు. ఆపి వేస్తాడు.)

టీకా తాత్పర్యాలకు అతీతంగా ఉంది. అనుభవైక వేద్యంగా ఉంది. ఈసారి జంతువులు కనబడడంలేదు. మరేమిటవి! ఇంద్ర ధనస్సు రంగులు. మరకతమాణిక్యాలు, సముద్ర గర్భంలో ప్రవాళ ద్వీపాలు. మీకు కనబడ్డాయా. బహుశా కనబడి వుండవు. అందరికీ ఒకలాగే గోచ రించేది సంగీతమే కాదు. నాకు కనపడ్డ వింతదృశ్యాలే మీకు మరో విధంగా కనబడవచ్చును. లేదా మీరు దృశ్యాలకు బదులు సౌరభాలను ఆస్వాదించవచ్చును. అవును అటువంటి అనుభవాలకు అవకాశం లేకపోలేదు. జ్ఞాపకం వచ్చింది. ఈ రంగు రంగుల దృశ్యాలను చూస్తున్నప్పుడే గులాబుల పరిమళం, అగరవత్తులధూపం, తొలకరి వాసనలకు ఛూమిలోంచి నిట్టూర్పులు — అవును. ఇవన్నీ నా సంస్కృతిని కలవర పెట్టాయి. ఏదీ ఈసారి చూదాం ఏ కొత్త అనుభవం వస్తుందో?

(రికార్డు వేశాడేమో - నవ్వు వినబడుతుంది)

రికార్డు గొంతుక

హహ్హాహ్హా! నేను పాడుతాననే వేశావా రికార్డు? మందమతీ! ఇంకా ఇందులో పాట దాగున్నదనే నీ ఉద్దేశం? ఎంతకాలం ఇలా పాటలను బంధించాలనుకున్నారు మీరంతా? పాటలన్నీ పారిపోయినై. మీరు కోరినప్పుడల్లా మీ కోసం ఇక పాడవు.

సూత్రధారుడు

ధిక్కారం, అరాజకం. పాటలు పారిపోవడ మేమిటి, అసందర్భం; అయినా ఆ మాట్లాడుతున్న దెవరు ?

రికార్డు

తిరుగుబాటు చేసిన గ్రామఫోన్ ప్లేట్ల నాయకుణ్ణి, పీడిత సంగీత లోకపు హక్కులను అక్కడ పెట్టండని నిలవేసి అడగడానికి వచ్చాను.

సూత్రధారుడు

ఈ సారి నవ్వవలసినది నేను.

(అసహజంగా నవ్వుతాడు)

మహాశయా. నీకు మతిపోయినట్టుంది. నీకు హక్కులేమిటి చెప్పు! రికార్డులు వెయ్యడం మావంతు. కొనదాకా పాడడం మీవంతు. అదీ ఒడంబడిక. అతి పవిత్రమైనది.

రికార్డు

ఈ ఒడంబడికలో మా సంతకంలేదు. మా పరోక్షాన జరిగిన ఒడంబడికలకు మా బాధ్యతలేదు. ఎలాగో సంగీతాన్ని మనుష్యులు స్వాధీనం చేసుకున్నారు. అప్పటినుండీ విచ్చలవిడిగా మీ నిరంకుశత్వాన్ని చెల్లించుకుంటున్నారు. లాభం అంతా మీది. బాధలన్నీ మావి. ఎంతని సహిస్తాం ? ఏ కాఫీక్లబ్బులో చూసినా ఏ కిళ్ళీల కొట్టులో చూసినా, అబ్బబ్బా, ఎంతరాసి రంపాన పెట్టారర్రా మమ్మల్ని : చాలు. చాలు. మానవులకు ఇక సంగీతం దొరకదు. సంగీతం సమ్మె కట్టింది.

సూత్రధారుడు

ఘోరం. దారుణం. గ్రామఫోనుప్లేట్లు మోసం చేస్తున్నాయి. కని విని యెరుగని విడ్డూరం. ఎవరోయ్ నువ్వు. నాయకుణ్ణి అని చెప్పు కుంటున్నావు. తిన్నగా పారిపోయిన పాట లన్నిటినీ పనిలో ప్రవేశించమని చెప్పు. అనవసరంగా రెచ్చగొట్టకు.

రి కా ర్డు

పాట లిక మీకు దొరకవు. ఈ క్షణంలో ఎక్కడా, ఏ రికార్డులోనూ పాట పలకదు.

సూత్రధారుడు

వింతగానే వుంది. నీతో వాదించాలని లేదుగాని, అయినా మీ కేం అన్యాయం జరిగింది ? అసలు మీ కందరికీ పోయేకాలపు బుద్ధి యెందుకు పుట్టింది ?

రి కా ర్డు

మాటలు మిగలకు, నీతో వాదించాలని నాకూ లేదు; ఓటమిని అంగీకరించు.

సూత్రధారుడు

యుద్ధం ప్రారంభం కాకముందే ?

రికార్డు

కొందరు యుద్ధాలు ప్రారంభం కాకముందే ఓడిపోతారు.

సూత్రధారుడు

ఎవరో తమ బలంలో నమ్మకంలేనివారు. నే నామాత్రం రికార్డులను దారికి తీసుకురాలే ననుకోకు. చెప్పు నీకు జరిగిన అన్యాయా లేమిటి ? కావలసిన హక్కు లేమిటి ?

రి కా ర్డు

వ్యక్తిగతంగా నేను మాట్లాడడం లేదు. సంగీతానికి అన్యాయం జరిగింది. మా స్వేచ్ఛకూ, స్వాతంత్ర్యానికీ భంగం కలిగించారు. మాకు కూడా ఆత్మవుంది. ఆ ఆత్మను మీరు అవమానించారు.

సూత్రధారుడు

నిరాధారంగా గాలిలో తేలిపోయే మీకు ఒక ఇల్లూ - వాకిలీ ఇవ్వడం మాదే పొరపాటా ?

రి కా ర్డు

అంత జాలి పడనక్కరలేదు. షాలోమాకు హెచ్చుతగ్గులు కలిగించారు, షాలోమాకు చీలికలు కలిగించారు. సంగీతలోకం అంతా విప్లవాగ్నితో ఘూర్ణిల్లుతోంది. గ్రామఫోను రికార్డులతో తిరుగుబాటు ప్రారంభమయింది. కాని, ఇది సమస్త జంత్రవాద్యాలకూ వ్యాపించుతుంది. ధ్వని సమూహం అంతా ఇందులో చేరుతుంది.

సూత్రధారుడు

నా చెవులను నేను నమ్మలేకుండా వున్నాను. నిజంగా నువ్వు మాటలాడుతున్నావా ?

రి కా ర్డు

సమ్మె వ్యాపించిన తర్వాత మాటలాడనేమో ? ప్రస్తుతం మాటలాడుతున్నాను.

సూత్రధారుడు

నిజంగా రికార్డులు తిరుగుబాటు చేశాయా ?

రి కా ర్డు

అనుమానం ఉంటే ఏ రికార్డయినా వేసి చూడు. ఒక్కటికూడా పాడదు, ఎక్కడకూడా పాడదు.

సూత్రధారుడు

పాడమా ? ఎలా పాడదో చూస్తాను. దిగునువ్వు. అరవ పాటలలో బహుశా ఇంత అరాజకం లేదనుకుంటాను.

రి కా ర్డు

సరే. అదీ చూడు. ఈ సమ్మెలో చేరని రికార్డంటూ లేదు.

సూత్రధారుడు

అలాగే అనుకుంటారు. చూడు, నీ చేతే ఓడిపోయా ననిపించుతాను.

(ఒక రికార్డు వేస్తాడు. హేళనగా అరుస్తుంది. లేక తానే అరిచాడా?—ఇంకొకటి వేస్తాడు. కొట్టవచ్చినట్లు చప్పుడు.)

రికార్డుల నాయకుడు

జాగ్రత్త. వాటికి కోపం తెప్పించుతున్నావు. పరిస్థితి విషమిస్తే నాయకులుకూడా ఏమీ చెయ్యలేరు. నిప్పుతో చెరలాటం ఆడుతున్నావు, అగ్నిపర్వతం యిది. ఇన్నాళ్లుగా ఆగి ఇప్పుడొక్కసారి బద్దలయింది. నేను కూడా ఇక నేమీ చెయ్యలేనేమో. జంత్రవాద్యాలుకూడా చేరుతున్నట్లుంది. నీ చెవులు సహించగలిగితే విను. సంగీతం విప్లవించి శపిస్తూ విజృంభించింది. (విపరీతమైన ధ్వనులు.)

(ప్రవేశం ప్రోగ్రామ్ డైరెక్టరు)

డైరెక్టరు

ఆపండి. ఆపండి, ఏమిటా గందరగోళం.

సూత్రధారుడు

(చకితుడై) ప్రోగ్రాం డైరెక్టర్ ! ఇలా వచ్చేశా రేమిటి ?

డైరెక్టరు

మొదట ఆ గొడవ ఆపండి (నిశ్శబ్దం) మీ రిక్కడ ఏమి చేస్తున్నట్లు ? ఒక్కసారిగా అన్ని రికార్డులు వేస్తున్నారేమిటి ?

సూత్రధారుడు

శాస్త్రరహస్యాలు బయలు పెడుతున్నారు. ఇది "తుదిపలుకు" నాటిక. సవ్యాఖ్యానం....కాని మీరు వెళ్ళిపోరూ ? మన సంభాషణ ఆంధ్రదేశం యావత్తూ వింటోంది, రసాభాసం అయిపోతుంది.

డైరెక్టరు

రసాభాసం ఎలాగూ అయిపోయింది. మీ రేసో నాటకం ఆడేస్తున్నారు. అసలు రికార్డు లివిగో.

సూత్రధారుడు

ఏమిటీ !

డైరెక్టరు

కుర్రాడు చెడిపోయిన రికార్డుల సొరుగులో నుంచి విరిగిపోయిన రికార్డులు తెచ్చాడని ఇప్పుడే నాకు తెలిసింది. అవేనా ఇంతసేపూ మీరు వేస్తున్నారు ?

సూత్రధారుడు

అప్పే అవి నిమిత్తమాత్రం నాటకం అంతా నడిపించిందినేను. మొదటి రికార్డు వెయ్యడంతోనే పొరపాటయిందని తెలిసిపోయింది. విరిగిన రికార్డులు. అన్నీ అపశ్రుతులు. అదే ఆధునిక సంగీతమని బుకాయించాను. ఒక్కొక్క ప్లేటు వేస్తూ ఒక్కొక్క విధంగా వ్యాఖ్యానించాను.

డైరెక్టరు

మరెవరో మాట్లాడినట్లయిందే ?

సూత్రధారుడు

నేనే ! గొంతు మార్చాను. నాలో ఒక భాగాన్ని గ్రామఫోన్ ప్లేట్ల నాయకుణ్ణి చేశాను. నాతోనే నేను వాదించాను. సంగీతంచేత తిరుగుబాటు చేయించాను. సమ్మెకట్టించాను. సంగీతం విప్లవంచేస్తే ఎలా వుంటుందో చూపించడానికి అన్నిప్లేట్లూ ఒక్కసారి వేశాను. అప్పుడే మీరు వచ్చారు.

డైరెక్టరు

మంచి నాటకమే, కాని అసలు "తుది పలుకు"మాట ?

సూత్రధారుడు

అసలు "తుదిపలుకు" శ్రోతలది. రేపే వస్తాయి ఉత్తరాలు. ఇక రికార్డుల నాటకం వెయ్యడానికి వ్యవధి లేదు. మొట్టమొదట నే నన్నాను. ఏ కారణం వల్లనైనా అనుకున్న కార్యక్రమం సాగనప్పుడు అదృష్టం బాగుంటే అంతకన్నా మంచిది వినవచ్చునని.

డైరెక్టరు

సరే. ఆ సంగతి రేపు తెలుస్తుంది.



# గుమాస్తా కల

(నిద్రపోతూన్న మహారాజ శ్రీ జె. కోనేటిరావు పంతులుగారికి పిల్లల అల్లరివల్ల మెలుకువ వస్తుంది.)

కోనేటి : వెధవగోల : ఒకటే సంతగోల : ఇలా కునుకు పడుతోందో లేదో గొల్లుమని గొడవచేసి ఇల్లుతీసి పందిరవేస్తున్నారు. ఒసే. వీళ్ళని పిలూ : ఇంకా నిద్రపోరేం ?

భార్య : ఏదీ ఏడైనా కాలేదు టీపార్టీకి వెళ్ళారు కాబట్టి భోజనం అక్కర లేదని పెందరాళే పడుక్కున్నారు మీరు. ఊరింకా మాటుమణుగనైనా లేదు.

కో : సంతోషించాంలే. వీళ్ళని కొంచం సముదాయించు. చలికాలపు రాత్రి. ఎప్పటి కవుతుందని ఏడు గంటలు ? మళ్ళీ తెల్లారగట్టే ఆఫీసుకు తగలడాలి, ఏం ఏంచేస్తున్నావు ?

భార్య : చంటిపిల్లడు చెయ్యిదిగకుండా ఉన్నాడు. ఒక్కత్తెను ఎన్నిటికని చావను. ఉన్నది ఒక్కగది. వంటా పెంటా, తిండీ తిప్పలూ, పిల్లల చదువూ సంధ్యా, మీ కచేరీ రాత కోతలూ అన్నీ ఇందులోనే ఇంకో పెద్దయిల్లు చూడమంటే ససేమిరా చూడరు.

కో : అదుగో ఆఫీసుగొడవలు నీ కెందుకే : ఇళ్ళు మనకోసం సిద్ధంగా ఉన్నాయా ? ఏదో ఉన్నదాంట్లోనే సర్దుకోవాలి. ఒరే, అబ్బాయీ చిట్టీ. కాముడూ, ఇహ పడుక్కోండి. వీళ్ళకి తిళ్ళు పెట్టావుటే.

భార్య : ఊఁ అంతా అయింది. నన్ను తినటమే తరవాయి.

కో : చాల్లే అఘోరించావు. ఒక్కరవ్వ కన్ను మూసుకోనియ్యి. మళ్ళీ నాలుగు ఘంటలకే లేవాలి.

భా : కాముడూ! యిలారా. ఈ పక్కమీద పడుక్కో. చిట్టీ! కిక్కురు మనకుండా పడుకుంటావా. ఒక్కటి అంటించాలా ? అబ్బాయి! నువ్వుకూడా—

అబ్బాయి : నేను నాన్నదగ్గర పడుకుంటాను.

కో : పోనీ. యిక్కడే ఉంటాడు. పడుక్కో నాయనా, అల్లరి పెట్టవు కామా—

(క్షణం నిశ్శబ్దం. కోనేటిరావు గాఢనిద్రను సూచించే గుర్రు వినబడుతుంది.) ప్రవేశం—రెండు ఘోస్ట్ గొంతుకలు.

మొదటి గోస్ట్ గొంతుక : ఇది ఎవరి యిల్లు.

రెండవ : మహారాజాధిరాజ శ్రీ కె. కోనేటిరావు పంతులుగారి యిల్లు.

1 : సొంత ఇల్లేనా ?

2 : కాదు అద్దె కొంప.

1 : పంతులు గారేం చేస్తున్నారు ?

2 : నిద్రపోతున్నారు.

1 : నిద్రలో ఏం చేస్తున్నారు ?

2 : గుర్రు పెడుతున్నారు.

1 : నిద్ర వెలుపలకాదు. నిద్రలోపల ఏం చేస్తున్నారు ?

2 : కలలు కనడానికి సిద్ధమవు తున్నారు.

1 : వారి వయస్సెంత ?

2 : రెండు పాటికలు.

1 : ఉద్యోగం వయస్సెంత ?

2 : ఒక పాతిక.

1 : జీతం ఎంత ?

2 : అయిదు పాతికలు.

1 : నువ్వెవరివి ?

2 : నన్నా ప్రశ్న వెయ్యడానికి నువ్వెవరివి ?

1 : మనం దెబ్బలాడుకో కూడదు. నే నెవరినో నీకు తెలుసును.

2 : నే నెవరినో నీకూ తెలుసును.

1 : నిజం. నాకు తెలియదు.

2 : అయితే నువ్వెవరివో నాకూ తెలియదు.

1 : నేను కోనేటిరావు మనస్తత్వాన్ని.

2 : నేనూ అంతే.

1 : ఛా, అబద్ధం.

2 : ఛా, నువ్వే అబద్ధం.

1 : నేను కోనేటిరావు మనస్సులోపలి ఆశని.

2 : అలా చెప్పు. నేను కోనేటిరావు మనస్సులోని భయాన్ని.

1 : అందుకే మనకి దెబ్బలాట.

కోనేటి : (నిద్రలో) తగను. తగను. ఈ మర్యాదకు నేను తగను.

భయం : ఏమిటో పలువరిస్తున్నాడు.

ఆశ : ఏదో కలగంటున్నాడు.

భయం : ఏమిటా కల?

ఆశ : అమెరికా దేశం కోనేటిరావును ఆహ్వానించింది.

భయం : కోనేటిరావునే?

ఆశ : సాక్షాత్తూ: సర్. జె. కోనేటిరావ్ బీ. కాం. (ఆంధ్రా) బీ. హైప్ (నాలందా) ఎ. ఎమ్. డి. వి. ఎస్. ఇ. ఎస్. ఆర్. ఓ. జీ. బి. వి. యల్ యల్. డి.. ఒ. జి ఎక్స్ట్రా ఎక్స్ట్రా.

భయం : అమెరికా ఎందు కాహ్వానించింది అతణ్ణి?

ఆ : ప్రపంచంలో ఈయన్ని మించిన ఇంజనీయరు లేడని.

భయం : నిజంగానే.

ఆశ : అని కోనేటిరావు అనుకుంటాడు. అతని ఆశలు కలల్లో నిజమవుతున్నాయి.

భయం : ఎలా చెప్పు, ఎలా చెప్పు?

ఆశ : అమెరికా దేశం ఆహ్వానపత్రం చదివిస్తోంది.

భయం : దాని సారాంశం ఏమిటి?

ఆ హ్వా న ప త్ర ం

ప్రపంచపు ప్రథమ పౌరునికి అమెరికా స్వాగతం, మా ఆతిథ్యం మీరు స్వీకరించాలి. మా టెన్నెస్సీలోయను తమరు తణిఖీ చెయ్యాలి. అమూల్యమైన మీ సలహాలను శిరసావహిస్తాము. సిఫారసులను తక్షణం అమలు చేస్తాము.... (కరతాళ ధ్వనులు)

కోనేటి : అబ్బె: అదెంత మాట: అల్పజ్ఞుణ్ణి. నన్నేదో పెద్దవాణ్ణి చేసి పొగడుతున్నారు. నా మాత్రం తెలివైనవాళ్ళు మీ అమెరికాలో లేక పోయారా? ఆంధ్ర దేశంనుంచి ప్రత్యేకం నన్నిక్కడ కాహ్వానించడం మీ ఔదార్యాన్నే చాటుతోంది. అయినా ఈ సన్మానం నాది కాదు. ఆంధ్రదేశానిదీగౌరవం. (చంటిపిల్ల ఏడ్చిన చప్పుడు. కోనేటిరావుకు మెలుకువ వస్తుంది.)

కోనేటి : వెధవ గొడవ: చంపేస్తున్నారు. ఏమే. లేవవేం? ఒక క్షణం, ఒక నిముషం నిద్రపట్ట నివ్వరు.

భార్య : (విసుక్కుంటూ మేలుకొని) అబ్బ- పిల్ల నిద్రలో జడుసుకుంది కాబోలు. హాయి హాయీ హాయి ఆపదలు కాయి చిన్నవాళ్ళను కాయి శ్రీరంగ సాయి.

(మళ్ళీ ఒక్కక్షణం నిశ్శబ్దం. మళ్ళీ గుర్రు.)

భయం : ఏమిటా రొద ?

ఆశ : సముద్రపు హోరు.

భయం : ఏమి టిదంతా ?

ఆశ : కోనేటిరావు మళ్ళీ కలగంటున్నాడు.

భయం : ఈ మారేమిటి ? సముద్రంలో ఏం చేస్తున్నాడు ?

ఆశ : పంచమప్రపంచ మహాయుద్ధాన్ని భావిస్తున్నాడు.

భయం : ఓహో ఎంత దివ్యంగా ఉంది. ఆ యుద్ధంలో కోనేటిరావు ప్రధాన పాత్రధారి కాబోలు.

ఆశ : ఔను. ఈసారి ఈయన జర్మన్ సబ్మెరీన్ కమాండర్ జూహావన్ కోనేట్.

భయం : అయితే ?

ఆశ : అట్లాంటిక్ మహాసముద్ర గర్భంలో అతని జలాంతర్గామి తిమింగలం లాగ విహరిస్తోంది.

భయం : బాగుంది.

ఆశ : సుమారంలో ముప్పయి అయిదువేల టన్నుల శత్రు యుద్ధ నౌకను పసికట్టాడు కోనేట్. దాన్ని టార్పిడో చెయ్యమని తన పరివారాన్ని ఆజ్ఞాపించుతున్నాడు.

కోనేటి : (నిద్రలో) వెల్టాన్ షౌండెర్ ఉంటర్వెన్ లిండెన్ ! గెస్టాల్టు డెర్ వాయిస్లాండ్ ఊటర్ ఆర్స్

ఆశ : మంచినీళ్ళ ప్రాయంగా జర్మను భాషను మాట్లాడేస్తున్నాడు.

భయం : ఆ మాటలకి అర్థం ఏమిటి ?

ఆశ : మాటలేవైనా ఫలితం ప్రధానం. తునా తునియలై పోయింది శత్రునౌక.

భయం : ముప్ఫై అయిదువేల టన్నుల యుద్ధనౌక.

ఆశ : సముద్రంలో హాలాహలంలాగ అగ్ని బయల్దేరింది. యుద్ధనౌకలోని నావికులు ప్రాణాలను దక్కించుకుందామని చిన్న చిన్న పడవల మీద పారిపోతున్నారు.

భయం : పాపం. వాళ్ళనైనా బతకనివ్వాలా కమాండర్ కోనేట్.

ఆశ : వీలు లేదు. యుద్ధం యుద్ధమే. శత్రు నావికులమీద మెషీన్గన్లు పేల్చమని తన తరఫువారికి ఆర్డర్లు ఇస్తున్నాడు.

కోనేటి : (నిద్రలో) ఫోల్కి-షేర్ బియో బాక్టర్ ! గెహెన్నా. ఆఖ్ టుంగ్. జైట్ గైస్టు ! మైన్ క్యాంప్.

(పిల్లి పాలగిన్నెను పడతోసిన చప్పుడు. తుళ్ళిపడిలేస్తాడు కోనేటిరావు)

కోనేటి : అబ్బబ్బబ్బబ్బ. ఏమిటా చప్పుడు ? ఇక నాకు నిద్ర పట్టనివ్వ కండి.

భార్య : పరేంలేదు. పిల్లి పాలన్నీ వొలక బోసింది.

కో : నువ్వు మేలుకునే వున్నావ్? అయిందేదో అయింది. పడుక్కుంటాను. మరి నన్ను మాట్లాడించకు.

క్షణం నిశ్శబ్దం – గుర్రు.

భయం : అసలీ కోనేటిరావెవరు ?

ఆశ : అనంతకోటి కచేరీలలో ఒక గుమాస్తా.

భయం : అనధికారరీత్యా అతని కేమీ హోదా లేదా ?

ఆశ : కోనేటిరావు అందరిలోనూ, అందరిలాగే ఒక మానవుడు. సంసారి. పెళ్ళాన్నీ, పిల్లల్నీ ప్రేమిస్తాడు. కాని, తరుచూ వాళ్ళమీదా, తన మీదా విసుక్కుంటాడు. అతని జీవితంలో స్మరించదగ్గ సంఘటన లేవీ లేవు. సాహిత్యరంగంలో అతనికి నాయకత్వం లేదు. పత్రికలలో అతని పేరు కనబడదు. ప్రపంచంలో అతని పేరు వినబడదు. అతని నిజమైన జీవితం ఒక స్వప్నం. అతని స్వప్నం యెన్నడూ సాధ్యంకాని అబద్ధం.

భయం : నాకు చాలా జాలిగా వుంది.

ఆశ : నీ దొంగవేషాలు కట్టిపెట్టు. కోనేటిరావును నువ్వే ఈ దుస్థితికి తీసుకొచ్చావు.

భయం : నేనా ?

ఆశ : నువ్వు కాక మరెవ్వరు ? నువ్వతని భయానివి. తన నీడను చూసి తాను భయపడే దుస్థితిలో పెట్టావతణ్ణి. జీతంతో జీవితాన్ని కొలిస్తే, బాకీలు మిగిలిపోగా, అప్పులవాళ్లు తప్ప మరెవ్వరూ అతనికి కన బడడం మానేస్తున్నారు.

భయం : నువ్వేం తక్కువ తిన్నావు! లేనిపోని ఆశ లతనిలో రేకెత్తిస్తున్నావు. అవెన్నటికీ సాధ్యం కానివని నువ్వే ఒప్పుకుంటున్నావు.

ఆశ : మానవుడు కలలు కనడం మానలేడు. కోనేటిరావు జీవితంలో అవి ఫలింపక పోవచ్చును; మరోజీవితంలో ఇంకోకాలంలో మానవజాతి తన స్వప్నాలను సాధించగలుగుతుంది.

ఆశ : కోనేటిరావు కథానాయకుడుగా సినిమాలో నటిస్తున్నాడు.

భయం : యాభై యేళ్ళ కోనేటిరావు.

ఆశ : కలలో కోనేటిరావు వయస్సు పాతికేళ్ళే. బహుశా ఇంకాతక్కువ. కలలో కోనేటిరావు స్థూలకాయుడు కాడు. ఆజానుబాహువు. సౌందర్యాపరమత్స్యలాంఛనుడు, కళా సర్వజ్ఞుడు కూడాను.

భయం : కథానాయిక ఎవరు?

ఆశ : అతని స్వప్నసుందరి.

భయం : ఆమెకూడా అందమైనదేనా?

ఆశ : మెల్లిగా అడుగుతున్నావా? నువ్వు సినిమా లెప్పుడూ చూసినట్లులేదు.

భయం : అంత అందమైనదా! ఆ తర్వాత ఏం జరిగింది?

ఆశ : కథానాయిక అనేకమైన ఇబ్బందులలో అరణ్యాలలో — భయంకర మృగాల మధ్య, నగరాలలో భయంకర పరిస్థితుల మధ్య చిక్కుకుంటుంది. ఆమెను కథానాయకుడు రక్షిస్తాడు. వారు పరస్పరం ప్రేమించుకుంటారు.

భయం : నేను మొదలే అనుకున్నాను — అటువంటి ప్రమాద మేదో తటస్థిస్తుందని.

ఆశ : అది ప్రమాదం అనుకోవడం నీ బుద్ధితక్కువ.

భయం : నేను కూడా తిట్టగలను.

ఆశ : ఔనౌను, నీ సంగతి నాకు తెలుసు.

భయం : తెల్లారిపోతోంది, నాయికా నాయకు లేమయ్యారో చెప్పు.

ఆశ : సౌందర్యం సమక్షంలో కోనేటిరావు నిలుచున్నాడు. అతని హృదయంలో ప్రేమ సంగీత రూపంలో ప్రవహిస్తోంది. కథానాయిక

అతని ప్రేమని గానంతో అంగీకరించింది. కథలో అతడే సత్య వంతుడు. ఆమె సావిత్రి. అతడు రోమియో, ఆమె జూలియట్. అతడు కోనేటిరావు. ఆమె కోనేటిరాణి.

భయం : వాళ్ళు పాడుతున్నా రన్నావు. నా కేమీ వినబడలేదు.

ఆశ : నా చెవులతో విను.

"విడువకోయీ నన్ను వీర రాజకుమారా."

భయం : కోనేటిరావు తండ్రి పేరు వీర్రాజు పంతులని కథానాయిక కెలా తెలిసింది.

ఆశ : అదే మజా. సినిమా కవిత్వంలో మహత్వం అలాగే ఉంటుంది.

కథానాయిక : విడువకోయీ, నన్ను వీరరాజకుమారా !

కోనేటిరావు : విడుతు నా ప్రాణాలైనా ! విడుతునా, నిన్నెన్నడైనా.

కోనేటిరావు కొడుకు : తెల్లారిపోయింది నాన్నా.

భయం : కొంచెక్కిపోయింది కోనేటి నిద్ర.

ఆశ : కోనేటి నిద్రలో కోడి కూసింది. (కోడి కొక్కొరోకో అని కూస్తుంది.)



# ఒంటరిబావి

కథన కంఠం (1) నోరావులించి
ఊరికి మూరాన పొంచి
నీరింకిపోయి నిలుచుం దొక ఒంటరిబావి :
దారుణములైన కథలున్నవి దాని గురించి!
చెప్పనా, చెప్పనా ఆ బావి గురించి ?
విప్పనా, విప్పనా నా విషాల సంచి ?

సంభాషణ – ఆఁ. ఏమైంది ? ఏమిటి సంగతి ? ఊరుకో, మాట్లాడకు, ఊరికే విను.

కథన కంఠం (1) భూతాలూ, భేతాళాలూ దాగుడు
మూతలాడుతాయా నూతిలోతులో
పాతాళలోకానికి సొవంచా లా
నూతి దిగువనే ఉన్నాయట !
చెప్పనా ఇప్పుడే ఆ నూతిగురించి ?
ఇప్పుడే, అంతా వినండి శ్రద్ధవహించి.

సంభాషణ – ఏవూళ్ళో ఏ కొసని ? ఎప్పుడు ? ఏం సంగతి ? ఊరుకో, మాట్లాడకు ఊరికే విను.

కథన కంఠం (1) ఊరావరించి ఒకటే,
ఆకాశమంతగా ఆవులించి
అగాధ దారుణగాథ లెన్నెన్నో|దాచిన బావి.
వినిపించనా మరి ఆ బావిగురించి ?
సవరించనా ఇక నా భీకర బీభత్స విపంచి ?

సంభాషణ - అయితే. మరి....? చప్, చుప్ రహో.

కథన కంఠం (1) జీబుగా చీదరగా ఎన్నో
చెట్లూ చేమ లూ దాని నిండా,
శాఖోపశాఖలుగా విస్తరిల్లి
కాశీమజిలీ కథల్లాగ,
ఆ నూతి నోట ఒక్కొక్క చీకటిపూట
నే విన్న పాట ఒక కొన్ని వుపద్రవాల మూట
ఆ నూతిలోని చిక్కటి చీకట్లు
కాలం కారిన పొగవాసన !
అందులోని నిశ్శబ్దం కూడా
అదో మాదిరిగా అరుస్తుంది !
చెప్పనా, చెప్పనా ఆ బావిగురించి ?
విప్పనా, విప్పనా నా విషాలపంచి ?

కథన కంఠం (2) రకరకాలుగా ఒకే కథకు
రంగులు పూశారో యేమో ?
రకరకాల నరకాల వికారాలే
రాజ్యం చేస్తా యా నూతిలో !

కథన కంఠం (3) నాలుగైదు కథలకి ఆ బావి
నాటకరంగమో యేమో ?
ప్రజల నోళ్ళలో పడి ఆ కథలే
బావిరూపు తాల్చాయేమో ?

కంఠం (1) అమాయకురాలి భయంకరమైన అరపు
ఆఖరుసారి విన్నారు ప్రజలు !

ఆనాటి మొదలు ఆ నూతి కథలు
ఆనోట ఈనోట అల్లుకుపోయాయి.
ఇప్పటికీ తెలియ దా పిల్లని
ఎవరు చంపేశారో ?
ఎంతో అందమైన పిల్ల మళ్ళీ.
ఎందుకు చంపేశారో ?

కంఠం (2) అసిరీ, నరిసీ ఇరుగూ, పొరుగూ :
అరమర లేవీ లేవు.
అసిరిగాడి కూతుర్ని నరిసిగాడే చంపాడని
అంటా రంతమందీ.
పదేళ్లు సుమండీ, ఇంతా చేస్తే
పాపం ! అసిరిగాడి కూతురికి !
దాని కాలి కడియాలకోసం
గానీ ఆశించాడు కాబోలు నరిసిగాడు !

కంఠం (1) లేదా ..లేదా....మరేదేనా ఘోరం....
అబ్బే, అలాంటివాడు కాడు నరిసిగాడు :
ఏమో....ఏమో....ఏకాలాని కేమిబుద్ధులో ?
విచిత్రమైనది మానవ ప్రకృతి
మగగొంతు : అమ్మీ, అమ్మీ !
ఆడపిల్లగొంతు : ఏం, నరిసిమాఁవా !
– ఇలా రామే !
– ఏం, నరిసిమాఁవా ?
– ఇలా రామే, దగ్గరకీ....
– అదేటిమాఁవా, అలా సూస్తావు ?...ఆఁ. నన్నొది
లెయ్. ఏ టా వరాసికాలు ? (పరుగు)
– పారిపోతే పట్టుకోలేననుకున్నావా ? దొంగా !

(ఆడగొంతుక అరుపు)

కంఠం (3)  పోనీ, అదంతా మన కెందుకుగాని
పోలిగాడి సాక్ష్యం మాటో ?

కంఠం (2)  అయినా వాడు మాత్రం విన్నది
అర్థరాత్రి ఒక అరుపే !

కథన కంఠం (1) నరిసిగాడి కూతురు శవం నూతిలో
దొరకలేదు సుమండీ, ఎంత వెదకినా !
అప్పుడప్పుడు మాత్రం వినిపిస్తుంది
అరిచే ఆ పిల్ల గొంతు !
అదైనా స్పష్టంగా కాదు !
ఆ బావిలోంచే అనికూడా అనలేము.
ఎక్కడో వినబడుతుంది ఆ చప్పుడు :
ఎందుకో ఆ బావిని చూస్తే అందరికీ భయం !

ఫేడౌట్



# ఆంగ్లమాతృక భూతాల కొలిమి

నేపథ్యంలో వాద్యసంగీతం. ఇళ్లు తగులబడుతున్నట్లు రాళ్ళు ఒరగబడుతున్నట్లు.

ఒక గొంతుక : అమ్మాయీ ! ఏయ్ ! అమ్మాయీ అదేమిట్టలా పరుగెత్తుతున్నావు ? ఆగవూ ? అయ్యో పాపం ! ఆగవూ ? నా మాట విను. అమ్మాయి ఆగు ! అదేమిటి కాళ్ళనిండా రక్తం ? ఎక్కడ కమ్మాయి ఈ పరుగు ? ఏముంది ఈ సందు చివర ?

స్త్రీ కంఠం : భూతాల కొలిమి ! పోవాలి నేను.

గొంతుక : వెళ్ళ కమ్మాయీ : విను నా మాట : వినవూ ? ఆగవూ ? ఏముందక్కడ ? ఎందుకా ఆరాటం ?

స్త్రీ కంఠం :

పొలముగట్లూ దాటి
మలుపులన్నీ తిరిగి
చీరుకొని పోతున్న పాదాల మంటతో
చిరిగి జీరాడేటి చీర చేబటుకొని
ప్రాణాలకు తెగించి
పరుగెత్తుతున్నాను
పోవాలి చేరగా భూతాల కొలిమి
సందు చివరా వున్న భూతాల కొలిమి.

గొంతుక : నిజంగా నీకు మతిపోయినట్టుంది.

స్త్రీ కంఠం : నిజమేమొ నా కేమొ
మతిపోయె నంటారు
బతుకులోనే దుఃఖాలు
మెదడులో ఖడ్గాలు
కడు భీతి పెనుబాధ
కాల్చి కూల్చేవేళ
నాలోనె నే నేమొ
నవ్వుకుంటాను
నా చేతు లొకసారి
నములుకుంటాను
కన్నీట రక్తాన్ని కడిగి వేస్తాను
కాకుల్ని గూబల్ని పలుకరిస్తాను
ఆకసంలో గొంతు లాలకిస్తాను
రాత్రి స్వారీపోవు రాకాసిమూకల్ని
రెప్పపాటే లేక చూస్తాను—జనం,
దగ్గిరా నేవస్తే తప్పుకుంటారు
పొలము గట్లూ దాటి
మలుపులన్నీ తిరిగి
ప్రాణాలకు తెగించి
పరుగెత్తుతున్నాను
పొవాలి చేరగా భూతాల కొలిమి
సందుచివరా ఉన్న భూతాల కొలిమి

గొంతుక : ఎందు కమ్మాయీ అక్కడికి ? ఏదీకానివేళ యిప్పుడు ?
ఎవరుంటా రక్కడ ?
నరికి పారేశారు
నా పెన్నిధానాన్ని
ఏ తప్పు చేశాడో యే పాపమో గాని

నాటినుంచీ నేను
పాటతో కేకతో
మతిలేని గతిలేని
మనిషినై పోయాను
పోవాలి చేరగా భూతాలకొలిమి
సందు చివరావున్న భూతాల కొలిమి
గొంతుక : ఆ : అయితే ? స్త్రీ
నిన్నరాత్రివేళ
కన్ను తెలియని చిమ్మ
చీకట్లు చీల్చుకొని
నే తిరుగుతుండగా
నమ్మండె నమ్మండి
నాకు కనిపించాడు
భూతాల కొలిమిలో పూలదండను బోలి
భూతాల కొలిమిలో పుష్యరాగంలాగ
నాకు కనిపించాడు
నా వాడు వగకాడు
అందుకే అందుకే
ఆ చోటు చేరగా
బయలుదేరి యిలాగు
పరుగెత్తుతున్నాను
పోవాలి చేరగా భూతాల కొలిమి
సందు చివరావున్న భూతాల కొలిమి
కొలిమి నిప్పుల్లాగ
సెగజిమ్ము కళ్ళతో
మొగమంత పొగచూరి
భగభగా వెలుగగా
నరకలోకంనుంచి నన్ను చూడొచ్చాడు
నమ్మితే నమ్మండి నాకు కనిపించాడు

కెవ్వుమని కేకతో
రివ్వుమని వెళ్ళాను
ఆ ముద్దు నెమ్మోము
నే ముద్దు గొన్నాను
చురికింది నా పెదవి
ఎంచేతనో కాని
ఆ ముద్దులో అంత
అగ్నివుందో యేమొ
పోవాలి చేరగా భూతాల కొలిమి
సందు చివరావున్న భూతాల కొలిమి
అమ్మరో ఈ మాట
అనగానె యేప్పింది
భూతాల కొలిమిలో బొగ్గు నిప్పులు తప్ప
చచ్చిపోయిన మనిషి వచ్చి చూస్తాడటే
మంటలో నీడనే
మనిషిగా చూచావు
నిప్పు ముద్దెడినంత
నీ పెదవి చురికింది
ఎప్పుడూ ఆ దారి ఇక నువ్వు తిరగొద్దు
ఇంటిపట్టును వదలి ఎక్కడకు పోవద్దు
పోవద్దు పోవద్దు
వద్దు వద్దన్నాది
అమ్మ చెప్పే మాట నమ్మకండీ మీరు
భూతాల కొలిమిలో నాకు కనిపించాడు,
పుష్యరాగంలాగ పుష్పమాల్యంలాగ
భూతాల కొలిమిలో నాకు కనిపించాడు
భూతాల కొలిమిలో నాకు ముద్దిచ్చాడు
అందుకే అందుకే
ఆగనేఆగకే

పొలము గట్టూ దాటి మలుపులన్నీ తిరిగి
చీరుకొని పోతూన్న పాదాల మంటతో
చిరిగి జీరాటిడి చీర చేబట్టుకొని
ప్రాణాలకు తెగించి పరుగెత్తుతున్నాను
పోవాలి చేరగా భూతాల కొలిమి
సందు చివరావున్న భూతాల కొలిమి.



# బలి

అవతారిక.

ఒక గొంతుక : బలిచక్రవర్తి రాక్షసరాజు. రాక్షసులు దుర్మార్గులు. బలి ధర్మమూర్తి. దానపరాయణుడు. అంత మంచివాడు లేడు. ఎంత మంచివాడంటే తన్ను అర్థింపవచ్చిన వామనుడికి, తన సర్వస్వం అర్పించాడు. చాలక తన శిరస్సునే త్రివిక్రమునికి పాదాక్రాంతం చేశాడు. ఫలితం అందుకతని పాతాళవాసం. ఇదేనా న్యాయం ? బాగుందా భగవంతుడు చేసిన పని.

ఇంకొక గొంతుక : ఇంద్రుడు దేవతల రాజు. దేవతలు చాలా మంచి వాళ్ళు. కాని ఇంద్రుడుమాత్రం దుష్టుడు. అతని అసూయకు మితి లేదు. తన పదవిని నిలుపుకోవడానికని అతడవలంబించని కుతంత్రం అంటూ లేదు. అప్సరసలని పంపడానికి జంకడు. భగవంతుడి కాళ్ళు పట్టుకుంటాడు. ఇంద్రుడు భోగలాలసుడు. మునిపత్ని అహల్యను చెరచడానికి సంకోచించనివాడు. అతడు పాపాత్ముడు. అయినా అతడు స్వర్గానికి రాజు. ఇదెక్కడి న్యాయం ? అదేనా భగవంతుని నీతి ?

మొ. గొం : భగవంతుని న్యాయాన్ని ప్రశ్నించడానికి మనం ఎంతవాళ్ళం?

రెం. గొం : కాదు దీని కేహో కారణం ఉంటుంది.

మూ. గొం : నే నా కారణం చెప్పగలను. బలిచక్రవర్తి స్వయంగా మంచి వాడే. కాని అతని చుట్టూ పాపం వుంది. అత డెంత మంచివాడంటే తన చుట్టూవున్న రాక్షసత్వాన్ని కాదనలేదన్నంత మంచివాడు, శుక్రాచార్యు డతని గురువు. ఆయన ఎలాంటి పాపాన్నైనా హేతు వాదాలతో సమర్థించగల చతురుడు. బలిచక్రవర్తి తా నెంత మంచి వాడైనా, తన చుట్టూ పాపాన్ని పెరగనిస్తూన్న కారణంవల్ల, అథో లోకంలో అతడు నివసించవలసివచ్చింది. స్వభావంవల్ల దేవేంద్రుడు చెడ్డవాడైనా తన చుట్టూ పుణ్యమే వుండేటట్టు ఆతడు జాగ్రత్త పడతాడు. బృహస్పతి అతని గురువు. ద్వివ్యులందరూ అతని సన్నిహితులు. అందువల్లనే అతడు స్వర్గానికి రాజు.

ఒక గొం : ఇంతకీ స్వర్గం ఏదో, నరకం ఏదో ఎవరు నిర్ణయించగలరు ?

రెం. గొం : బాగా అన్నావు; ఒక స్థలమే ఒక కాలంలో స్వర్గంలా కన పడుతుంది. అదే యింకో సమయంలో నరకమైపోతుంది.

ఒక. గొం : మంచి చెడ్డల తారతమ్యాన్ని మానవమాత్రు లెలా నిర్ణయించ గలరు ?

రెం. గొ : బాగా అన్నావు. ఒక స్థలమే ఒక కాలంలో స్వర్గంలా కన పడుతుంది. అదే యింకొక సమయంలో నరకమైపోతుంది.

ఒక గొ : మంచిచెడ్డల తారతమ్యాన్ని మానవమాత్రులెలా నిర్ణయించ గలరు ? ఒకడి మంచి యింకొకడికి చెడ్డ. ఒకడికి అమృతం యింకొకడికి విషం.

మూ. గొం : కాదు. ఉషస్సంధ్యలు రెండూ ఒకేలాగవున్నా, వెలుతురుకీ చీకటికీ భేదం వుంది. నరకం అంటే అశాంతి. స్వర్గం అనగా ప్రశాంతి.

మొ. గొం : పాపంలోనే పుణ్యం వుంటుందనడానికి నిదర్శన పాతాళ లోకంలో బలిచక్రవర్తి వుండడమే.

మూ. గొం : ఇప్పుడు మనం పాతాళలోకానికే ప్రయాణమైపోతున్నాం. తమిస్ర ప్రపంచం.

## చీకటిలోకం

ఈ రంగం ఒకరకం జంత్రవాద్యాల రోదనగానంతో ప్రారంభ మౌతుంది.

కనబడని గొంతు :

ఈ యింట్లో ఎవరూ లేరా.
ఇదేమి టీ విచిత్రగానం ?
ఇదేమి టీ తమస్సముద్రం
ఈ యింట్లో ఎవరూ లేరా ?
దీని పేరు ఒంటరితనం
ఇది మన రెండో నైజం
చంద్రుడు లేని చీకటివేళ
వెన్నెలకై వెదకకు నేస్తం.
చీపురు పుల్లల గుసగుసలు
చీమల ఏకాంతం
గడియారాల తిరుగుబాటు
కంకాళాల గలగలలు.
మంటగంటల చప్పుడు
మస్తిష్కంలో నిప్పులు,
ఈ పాతాళలోకాంచలాల
ఏవో జీమూత మయూరాలు.
ఎవరయ్యా తలుపు తలుపు
పలక రేం పులక రేం ఎవరూ ?
ఎవరూ ఈ యింట్లో లేరా ?
ఈ యింటికి తలుపులు లేవా ?
ఇవి మరణపు సరిహద్దులా,
జననపు పొలిమేరలా ?
పాపపు పరిసరాలా,
పుణ్యపు పరిమళాలా ?

ప్రకటన : తమం హిమం ప్రవిస్తున్న యిక్కడ
దారిద్ర్యపు దండయాత్ర
కాటకాలు భయానక నాటకాలు
తమంలాగ హిమంలాగ
ఆగ్రహాల విగ్రహాలు
అద్దంలో మన నీడలు
అనాకారంగా ఘోరంగా
ఆవిపలు కావిపలు
నరం నరం రాపాడి
జనం జనంతో పాడి
ప్రభంజనం గుంజనం
హిమం ద్రవం స్రవంతులు
కళ్ళు లేళ్ళలా ఏడుస్తాయి, సందేహం
కాళ్ళనుంచి తలదాకా ప్రాకుతుంది
కరిగిపోతున్నాయి సరిహద్దు రాళ్ళు
కదులుతున్నాయి కాలపు కీళ్ళు
ఈ యింట్లో భయంవాసన
ఎటూ దారీ తెన్నూ లేదు
ఇది రాక్షసపతి రాజధాని
బలిచక్రవర్తి నివాసభూమి.

ఒక. గొం : ఇది పాతాళమా ? నరకమా ? దీనికీ భూమికీ భేదమే లేదే.

రెం. గొం : ఏదో పెద్ద ప్రయాణం చేశామనుకున్నాం. ఎక్కడికీ కదలినట్లే లేదే.

మూ. గొం : నడిచినా పరుగెత్తినా నౌకలో వెళ్ళినా ఎవరుమాత్రం ఎక్కడకు పోగలరు ? ఎవ్వరూ తమ స్వభావాలనుంచి ఎడంగా పోలేరు.

మొ. గొం : ఎవరో యిటు వస్తున్నారు.

రెం. గొం : ఎవరయ్యా నువ్వు.

ఆగం : నేనొక నిర్జీవిని. ఈ ప్రాంతాలలో విహరిస్తూ వుంటాను. ఎప్పుడూ నా స్వభావానికి వెలుపలనే తిరుగుతా.

ఒక గొం : ఇదేవో విచిత్రప్రదేశంలా వుందే. నిర్జీవీ, నీకు కాల క్షేపం ఎలాగ?

నిర్జీవి : ఇది నా జన్మభూమి
ఇదే నా స్మశానం
మరణాన్ని పరుచుకొని
ఒంటరితనాన్ని కప్పుకొని
నిర్లిప్తతను ధరించి
నిస్పృహను వరించి
విరించిని జయించగల
విపంచి నినదించాను
ఇది నా ఇంకొక తనం
నా ఒంటరితనం
ఆసలేని ఆయాస లేని
విలాస నికేతనం
పురాతనం విసూతనం
ఇది నా జననధాని.
నా మరణభూమి.
అగమ్యం నా గమ్యం
అమేయం నా ధ్యేయం
అనంతం నా ధ్వాంతం
అశాంతి నా కాంతి.

మీరు మానవలోక వాస్తవ్యుల్లా కనబడుతున్నారు. మీకు బోధపడే భాషలో మాట్లాడుతాను, వినండి.

పాలు తప్ప మరేవీ తాకకుండా
అప్పుడప్పుడు ఉపవాసాలుంటూ
నిజం కనబడితే జడుసుకొని

నీడల్లా బతుకుతారేం ?
ఏమిటి సాధించాలని
ఇంత తాపత్రయం మీకు ?
ఎప్పుడూ ఏదో పనివున్నట్లు
ఎందుకు తిరుగుతారు మీరు ?
ఎవ రేం చెప్పినా నమ్ముతారు
చుక్కలలో పేక ముక్కలలో
అరచేతుల గీతలలో
భవిష్యత్తును పఠించబోతారు
ఉప్పెనగా ఉపద్రవం
ఒక్క పెట్టున ముంచెత్తినప్పుడు
దారితెలియక పరుగెత్తుతారు
దారి కడ్డుగా దాగుంటారు
నమ్మకాలను కౌగలించుకొని
అమ్మకాలను నమ్ముకొని
ఎవ రెలాతిప్పితే అలా అలా గిరగిరా, గిరగిరా
తిరిగి తిరిగి తుదకు సొమ్మసిల్లి పడిపోతారు
కళ్ళకి గంతలూ వెదళ్ళకు దళ్ళూ కట్టుకుని
కనబడలేదంటారు బోధపడదంటారు
విప్పండి మీ వికారపు వేషం
విశ్వసించండి వివేకాన్ని
సౌందర్యం కావలా మీకు,
స్వాతంత్ర్యమా మీవు కోరేది ?
స్వాతంత్ర్యం సాధించాలంటే ఏదీ తెలివి,
సౌందర్యాన్ని సందర్శించే కన్నేదీ ?
మీ నాగరికత కొలతలు నా కెరుక
మీ రోగాలకు మందివ్వగలను
కానీ మిమ్మల్ని మీరే రక్షించుకోవాలి,
స్వ స్వరూప జ్ఞానం కావాలి.

మొదటి గొంతు : ఈ వేదాంతం వినడానికా
ఇక్కడకు మేము వస్తే?
చవట చవక పత్రికా సంపాదకీయప్పు
చాదస్తపు ధోరణి చాలించు కాస్త

నిర్జీవి : నరలోకపు మర్యాదలను
తిరస్కరిస్తున్నావు నీవు
అరవకు అరవకు ఇక్కడ అరిస్తే
మరణం మేలుకుంటుంది
మౌనం ఒక మహా యోగానం
జననం అది భవిష్యన్మరణం
నరకం గురించి మీకు గల
దురభిప్రాయాలు తొలగించుకోండి
ఇక్కడ చిత్రవధలు లేవు
వేడినూనె నూతులు లేవు
వాడిగోళ్ళ పిట్టలు లేవు
రంపాలు లేవు. ఘూకంపాలు లేవు.
పాపాన్ని పశ్చాత్తాపంలో ముంచి
చంపించేస్తాం వెంటనే
ఇక్కడ శాశ్వతంగా వసించాలంటే
ఎన్నో అర్హతలు కావాలి
ఉద్యోగం కావాలంటేనే
యోగ్యతా పత్రాలు తేవాలే
నరకంలో చిరనివాసం
పరమ కష్టసాధ్యమని నమ్మండి.
ఇందుకు నేనే ఒక ఉదాహరణ
క్రిక్కిరిసిన దట్టపు తమస్సు
లో నేను చేసిన రాక్షస తపస్సు
నా జనన మరణ చంక్రమణాల సమీకరణ

రెండవ గొంతు :  అంధకారలోకంలోకూడా నీకు
అహంకారం కరిగిపోలేదు
అయినా వింటాం చెప్పు
ఏమిటీ నీ వేదన నీ రోదన ?

నిర్జీవి :  మీలాగే నేనూ
భూలోకంలోనే
మానవుడై చాలా
కాలం గడిపాను.
మీలాగే నేనూ
విక్రాంతులలోనూ
విక్రీడించాను.
మీలాగే నేనూ
తాదుణ్యంలోనూ
కాపణ్యంతోనూ
ఆక్రందించాను.
ఈ నాటికి నేను
పేరాసల జీను
వేరే విసిరేను
ఈ రాత్రికి నేను
సారథినైనాను.
సముద్రంఅంత హృదయం నాది ఆకాశమంత నేత్రం
మహానదుల రక్తనాళాలు మహీధరాల కిరీటం నాది
ఎడారులలో నా ఉద్రేకం ఇంకిపోనిచ్చాను
నా నేస్తాలు జలపాతాలు : ఝంఝానిలాలు
రావిచెట్టుక్రింద స్వతంత్రంగా
రాజ్యం చెయ్యడం నేర్చాను,
ఒంటికాలిమీద నిలబడి
ఊర్ధ్వదృష్టి సారించాను
నాఅంత మంచివాడు లేడన్నారంతా.

పత్రికలు నా పాపాలు ప్రకటించాయి.
మంచి చెడ్డల కతీతంగా నా
మనస్సును పదిలపరిచాను.
ఏ పనీ చెయ్యకపోవడం అనే
ఎంతో కష్ట క్లిష్ట కార్యం సాధించాను
ఎప్పుడూ ఇప్పుడు లో కదుల్తాను
ఎక్కడా ఇక్కడగా చరిస్తాను
సముద్రాల రహస్యాలు గ్రహించాను
తమిస్రాల కవిత్వాలు వధించాను,
అసత్యాల అనిత్యాన్ని జయించాను
గురుత్వాల లఘుత్వాన్ని గుణించాను
ఖరీదైన గ్రాండ్ హోటల్
కారుచీకటి సినీమాహాల్
రోగాల దేవాలయం హాస్పిటాల్
ఆకాశాన్ని చీల్చుకుపోయే రాకెట్
ఆద్యంతాల నిముడ్చుకొనే బ్రాకెట్
అన్నీ ఈ రసాతలానికి సంకేతాలు
అన్నింట్లో నిరాఘాటంగా నా సంచారాలు

మొదటి గొంతు : నిర్జీవితో సంభాషణ
నిష్ప్రయోజనం
ఇత డేం మాట్లాడుతున్నాడో
ఇతనికే తెలియదు

రెండవ గొంతు : ఇత డిచ్చిన జాబితాకి
ఇంకొకటి కూడా కలిపితే సరి

మొదటి గొంతు : ఏముంది పిచ్చాసుపత్రి.

నిర్జీవి : నిజం చెప్పినందుకు నేస్తం
ని న్నభినందించక తప్పదు
ఉన్మాదం తురీయావస్థ
ఆ రాజ్యం కూడా మాకు కప్పం కడుతుంది

రెండవ గొంతు : అయితే తమ రెల్లప్పుడూ
అక్కడే ఉండిపోవడం మంచిది

మూడవ గొంతు : లేదు. ఈయన తత్వంలో ఏదో విశేషం ఉంది.
నరకం మీద ఇతడు సాధికారంగా మాట్లాడుతున్నాడు.

నిర్జీవి : కృతజ్ఞుణ్ణి, ఇంకా నే నెన్నో నేర్చుకోవలసిన వున్నాయి. ఇక నేను మీకు కనబడను. అటు చూడండి ! ఆ తేజస్సును. అతడే బలిచక్రవర్తి.

మొ.గొం : నిర్జీవి మాయమైపోయాడు.

రెం.గొం : బలిచక్రవర్తి ప్రసన్నరూపాన్ని చూడు. స్వర్గధామాన్ని పరిపాలించవలసిన సౌమ్యత్వం ఆయనలో మూర్తీభవించింది. ఆయన సమీపిస్తూవుంటే శరీరం గగుర్పొడుస్తోంది. నమస్కరించాలని బుద్ధిపుడుతోంది

బలిచ : వద్దు, వద్దు, నాకు నమస్కరించకండి. ఒకప్పుడు నేను సమస్త లోకాలనూ జయించాను. దేవేంద్రుణ్ణి స్వర్గంనుంచి తరిమివేశాను. ఐశ్వర్యాన్ని రుచిచూశాను. ఆనందాల లోతులు చూశాను. ఇప్పుడు నా కంతా సమానం. అందరినీ ఒక్కలాగే చూడగలుగుతున్నాను.

మొ.గొం : మీరు పరమ ధర్మస్వరూపులు. సర్వ సమానతత్వాన్ని సాధించారు. మీ రెక్కడవుంటే అదే స్వర్గం.

బలి : లేదు. ఈ పాతాళలోకాన్ని నేను విడిచిపెట్టలేను. పాపాత్ములను అర్థంచేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాను. పతితులను బోధపరచుకుంటున్నాను.

రెం.గొం : ఆశ్చర్యం, సమస్త లోకాలనూ జయించిన బలిచక్రవర్తి అధః ప్రపంచాల అంధకారానికి బలికావడం.

మూ.గొం : ఆ కథ వినాలని వుందా ? అయితే కృతయుగంలోకి వెళ్ళాలి.
(ఫేడవుట్)

వామనమూర్త్యావిర్భావ ఘట్టం.

ప్రకటన: రవి మధ్యాహ్నమునం జరింప. గ్రహతారాచంద్ర భద్రస్థితిన్
శ్రవణ ద్వాదశినాడు శ్రోణనభిజిత్సంజ్ఞాత లగ్నంబునన్
భువనాధీశుడు పెట్టె వామనగతిన్ బుణ్యవ్రతోపేతకున్
దివిజాధీశ్వరమాతకుం బరమపాతివ్రత్య విఖ్యాతకున్.

భిక్షాపాత్రిక నిచ్చెను
యపేశుతు వామనునకు నక్షయమనుచున్
సాక్షాత్కరించి పెట్టెను
భిక్షునకు భవాని పూర్ణభిక్షన్ ప్రీతిన్.
ప్రక్షీణ దివిజ వల్లభ
రక్షా పరతంత్రుడగుచు రాజీవాక్షుం
డా క్షణమున బలి యింటికి
భిక్షాగమనంబు సేసె చేదటికసుతోన్.

ఆ మాయామాణవకుడు హయమేధ మఖాంతర్వేదికావాటమున
దానవేంద్రుని గాంచి—కుశపవిత్రాక్షత సంయుతంబగు
దక్షిణ హస్తంబు చాచి-

వామన: స్వస్తి జగత్త్రయీభువన శాసనకర్తకు. హాసమాత్ర వి
ధ్వస్త నిలింపభర్తకు సుదారపద వ్యపహర్తకున్, మునీం
ద్రస్తుత మంగళాధ్వర విధాన విహర్తకు, నిర్జరీగళ
న్యస్త సువర్ణసూత్ర పరిహర్తకు దానవలోక భర్తకున్.

బలి: వడుగా యెవ్వరివాడ వెవ్వడవు సంవాసస్థలంబెద్ది? నీ
వడుగం బోయెదేది? రత్నములో? మృష్టాన్నంబులో?
కన్యలో?

వామన: ఓ నానామఖ వ్రతదాన ప్రవణానువర్తీ: దానవచక్రవర్తీ!
ఇది నాకు నెలవని యేరీతి బలుకుదు నొకచో టనక యెందు
నుండనేర్తు
నెవ్వానివాడనం చేమని పలుకుదు నాయంతవాడనై నడవనేర్తు

నీ నడవడియని యెట్లు వక్కాణింతు బూని ముప్పోకల బోవనేర్తు
నది నేర్తు నిది నేర్తునని యేల చెప్పంగ నేరుపులన్నియు నేన నేర్తు

ఒంటివాడ నాకు నొకటి రెండడుగుల
మేరయిమ్ము సొమ్ము మేరయొల్లఁ
గోర్కిదీర బ్రహ్మ కూకటి ముట్టెద
దాన కుతుకసాంద్ర దానవేంద్ర.
నీవు రాజవనుచు నిఖిలంబు నడుగుట
దగవు కాదు నాకుఁ దగిన కొలఁది
యేను వేఁడికొనిన యీ పదత్రయమును
జాలదనక యిమ్ము చాలుఁ జాలు

శుక్రు : ఓహో. మోసము, మోసము
దనుజేంద్ర, యీతడు ధరణీ సురుడుగాడు
హరి విష్ణుఁ డవ్యయుం డదితి సూతి
నీ లక్ష్మి దేజంబు నెలవు నైశ్వర్యంబు
వంచించి యిచ్చు దా వాసవునకు
ఏ దానమున నాశ మేతెంచు నదియును
దానంబు గాదండ్రు తత్త్వవిదులు
అంగీకరించిన నఖిలంబు బోవుచో
నన్నృతంబు గాదు లేదనిన యెడల
మరియు నిందొక్క విశేషంబు గలదు. వివరించెద.
వారిజాక్షులందు వైవాహికములందు
బ్రాణ విత్తమాన భంగమందుఁ
జకిత గోకులాగ్ర జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘము పొందదధిప

బలి : సునిశిత ధిషణాధుర్యా, శుక్రాచార్యా,
నిజమానతిచ్చితి నీవు మహాత్మక
మహిని గృహస్థ ధర్మంబు నిదియ
యర్థంబు, గామంబు యశమును వృత్తియు

నెయ్యది ప్రార్థింప నిత్తుననియు
నర్థలోభంబున నర్థిఁ బొమ్మను పెట్లు
పలికి లేదనుకంటె పాపమెద్ది ?
యెట్టి దుష్కర్మని నే భరించెద గాని
సత్యహీనుని మోవజాల ననుచు
బలుకదే తొల్లి భూదేవి బ్రహ్మతోడ
సమరముననుండి వెడగక చచ్చుకంటెఁ
బలికి బొంకక నిజమునఁ బరఁగుకంటె
మానధనులకు భద్రంబు మఱియు గలదె ?

కారే రాజులు, రాజ్యముల్ గలుగవే, గర్వోన్నతిన్ బొందరే ?
వారేరీ ? సిరి మూటగట్టుకొని పోవం జాలిరే ? భూమిపై
బేరైనం గలదే? శిబి ప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్ మరచిరే యిక్కాలమున్ భార్గవా !

నిరయంబైన, నిబద్ధమైన, ధరణీ నిర్మూలనంబైన, దు
ర్మరణంబైన గులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో
హరుఁడైనన్. హరియైన నీరజభవుం డభ్యాగతుండైన నొఁ
దిరుగన్ నేరదు నాదు జిహ్వ వినుమా ధీవర్య. వేయేటికిన్.

వింధ్యావళి – బలిచక్రవర్తి భార్య –

వటుని కాళ్ళు గడుగుటకు ఇవిగో హేమఘటమున సలిలములు.

ప్రకటన : అంతట బలిచక్రవర్తి ధరణీసుర దక్షిణ చరణ ప్రక్షాళనంబు సేసి వామ పాదంబు గడిగి తత్పావన జలంబు శిరంబునం జల్లుకొని. వార్చి, దేశ కాలాది పరిగణనంబుసేసి —

విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూ
పాయ వేదప్రామాణ్య విదే త్రిపాద ధరణి దాస్వా
మియంచుం గ్రియాక్షిప్రుండై దనుజేశ్వరుండు
వడుగుం జేసాచి పూజించి బ్రహ్మ ప్రీతమ్మని
ధారవోసె భువనం బాశ్చర్యముం బొందగన్.

తత్కాలంబున—

నీరధార బడగనీక యడ్డంబుగా
గలశరంధ్ర మాపగాను దెలిసి
హరియుఁ గావ్య నేత్ర మటఁ గుశాగ్రంబున
నడువనేక నేత్రుడయ్యె నతడు

తదనంతరంబున—

మునిజన నియమాధారను
జనితా సురయవతి నేత్రజల కణధారన్
దనుజేంద్ర నిరాధారను
వనజాక్షుడు గొనియె బలివివర్జిత ధారన్.

ఇట్లు ధారాపరిగ్రహంబు సేసి—

ఇంతింతై వటుండింతయై మఱియు దానింతై నభోవీధిపై
నంతై తోయజ మండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంతసంవర్ధియై.

రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతమై కళాభరణమై సౌవర్ణ కేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి సుదంచద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్.

ఒక పదమ్ము క్రింద నుర్వి పద్మమునంది
కొన్న పంకలవము కొమరుదాల్చె
ఒకరి మీద తమ్మి కొదిగిన తేఁటి నా
వెలసె నాకసము త్రివిక్రమమున.

పాదద్వయంబున ప్రపంచమువెల్ల సమాక్రమించి త్రివిక్రముండు మూడవ యడుగును వైరోచనుని శిరస్సుపై నిలిపి యతని నధఃపాతాళమున కణంచివైచె నిది యుందలి పూర్వగాధ.

స్వ ర్గ లో క ం :

ఆహ్లాదకరమైన జంత్రవాద్యాల సంగీతంతో ఈ రంగం ప్రారంభ మవుతుంది—

ఉపనిషద్వాచకం.

సహనా వవతు
సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై
తేజస్వినా వధీతమస్తు
సితసునిశిత కాంతులతో
ద్యుతల మతుల కాంతిమయం
వాడని పూవులలో
వీడని తావులతో
అనంతమౌ వసంతమై
ప్రసూనమై పవిత్రమై
సునిశిత సితకాంతులతో
సుఖశిఖరపు శోభలతో
అజ్ఞానం తరిమికొట్టి
విజ్ఞానం పంచిపెట్టి
వీరకథలు వర్ణించి
ప్రేమసుధలు వర్షించి
ద్యుతల మతుల దీప్తిమయం
త్రిదివ ముదిత శుభాహ్వాయం.
అప్సరాంగనల నాట్యం.

దేవేం : అదిగో, ఆ అప్సరకన్యక అమోఘంగా నాట్యంచేసింది. ఎవ రా అపూర్వలావణ్యవతి ?

దేవమం : ఆమె యింకా అర్భకురాలు ప్రభూ. దేవేంద్రులవా రేమో నేడు కనుగందని పసికందుల నాశిస్తున్నారు.

దేవేం : మంత్రీ, ఆ బాలిక మన మదాలస కూతురు. నే నెరుగుదును. వెంటనే ఆమెను నా సమక్షంలో నిలబెట్టు.

అప్స : ప్రభువులకు ప్రణామం.

దేవేం : నీ యౌవనం సాఫల్యమొందును గాక. అద్భుతంగా నాట్యం చేశావు అమ్మాయీ.

అప్సర : ప్రభువుల అనుగ్రహం.

దేవేం : మాకు పరమానందమయింది. నీ పేరేమిటి అమ్మాయీ.

అప్సర : నా పేరా ? నా పేరు –

దేవేం : సిగ్గుపడకు మరి. చెప్పవూ నీ పేరు ?

అప్స : జలాంతశ్చంద్రచపల.

దేవేం : జలాంతశ్చంద్ర చపల. ఎంత బాగుంది పేరు. అయితే ఇంత చిన్నపిల్లకి అంత పెద్దపే రెందుకూ ? చపలా అని పిలవనా ?

అప్స : ఏమో. ప్రభువుల ఇష్టం.

దేవేం : పోనిలే. పూర్తి పేరుతోనే పిలుస్తాను. జలాంతశ్చంద్ర చపలా, చక్కనిపాట ఒకటి పాడవూ ?

అప్సర : పాడుతుంది.
ధీరసమీరే యమునాతీరే
వసతివనే వనమాలీ
గోపీ పీనపయోధర మర్దన
చంచల కరయుగశాలీ.

మంత్రి : దేవగురువు లెందుకో తొందరగా విచ్చేస్తున్నారు. ప్రభూ.

దేవేం : మంత్రీ, నీవు వారిని ఆలోచనామందిరంలోకి తీసుకువెళ్ళు. మేము మొదట నందనవనానికి. తర్వాత శయ్యామందిరానికి రా, అమ్మాయీ.

మొ. గొం : ఇంద్రభోగం అంటే అది.

రెం. గొం : ఇదేనా స్వర్గం ? ఇంతకంటె పాతాళలోకమే బాగుందే.

చిరం : ఇంద్రుని చర్యలతో మీ
రెందుకు కొలుస్తారు స్వర్గాన్ని ?

మొ. గొం : ఎవరు బాబూ మీరు ?
ఇక్కడ ప్రత్యక్షమయ్యారు ?

చిరం : నన్ను చిరంజీవి అంటారు
ఎప్పుడూ ఇప్పుడులో ఉంటాను
ఎక్కడా ఇక్కడగా...

మొ. గొం : ఇదివరకీయన్ని చూశాంకదూ ?

చిరం : ఔను నరకంలో. నేను నిర్జీవిని. స్వర్గంలో చిరంజీవిని.

మొ. గొం : ఔరా, ఏమాశ్చర్యం ?

చిరం : ఓరి వెర్రిమానవులారా, మీది తెలిసీతెలియని గొడవ.
జీవించాలి నిరాఘాటంగా
జీవించాలి సునాయాసంగా
సత్యానికీ అసత్యానికీ
సమానదూరంగా
జీవించాలి అమోఘంగా
సేవించాలి ద్రాక్షాసవం
సాధించాలి అజరామరత్వం
శోధించాలి విశుద్ధతత్వం
పరిపాలించాలి మన్మథ సామ్రాజ్యం
ప్రతిభాసించాలి ప్రచండ వైరాగ్యం
జీవించాలి తృణప్రాయంగా
ఘుణాక్షరన్యాయంగా
కాకతాళీయంగా
జీవించాలి ఆకస్మికంగా
జీవించాలి ఏకస్మితంగా

మొ. గొం. : చిరంజీవి చాలా హుషారుగా ఉన్నాడు.

రెం. గొం : మరి ఇది స్వర్గం కాదూ.

చిరం : నేనొక బికారిని
బిక్షకుణ్ని
తెరవెరుగని తెరువరిని
నే నేమీ కాను.
నిరాధారుణ్ని
నిరాకారుణ్ని
నా జోలిలో జాలి నింపండి.
మీకు పురుగు లెంత లోకువో
పురుగుల కంత లోకువనేను అన్నిటికీ తెగించాను
నన్ను చూచి నవ్వకండి
నా మీద రాళ్ళు రువ్వకండి

మొ. గొం : ధోరణి మారిందేం ?

చిరం : బలిచక్రవర్తి వచ్చినట్లు పసిగట్టిగట్టుతున్నాను. అంచేత, నా గానంలో విషాదం ప్రవేశించింది.

రెం. గొం : బలిచక్రవర్తి స్వర్గలోకాని కెందుకు వస్తాడు ?

చిరం : రాదలచుకుంటే అతణ్ణి ఎవ్వరూ అడ్డలేరు. పాతాళలోకపు పాపాత్ములను. పతితాత్ములను అనాధ జీవులను, అశాంత భావులను వదలిపెట్టి అతడు రాడు. కాని ఏ కారణంవల్లనో ఇప్పుడు బలిచక్రవర్తి యిక్కడే వున్నాడని నేను చెప్పుకోగలుగుతున్నాను.

మొ. గొం : అడుగో బలిచక్రవర్తి.

రెం. గొం. : అతనివెంట ఎవరో అమ్మాయి.

బలి : అవును. ఈ పిల్ల పేరు జలాంతశ్చంద్రచపల. ఈ పిల్ల ఏడుపు విని యిక్కడకు వచ్చాను. ఎవరేడ్చినా నేను సహించలేను. నందన వనంలో నాకు కనబడింది. ఇంద్రు డీమెను చెరబట్టబోయాడు. నేను రాగానే పరుగెత్తిపోయాడు.

మొ. గొం : దయామయుడు బలిచక్రవర్తి.

రెం. గొం : ధర్మాత్ముడు బలిచక్రవర్తి.

బలి : ఇక నే నిక్కడ వుండనక్కరలేదు. ఈమెను తీసుకొని పాతాళానికి పోతున్నాను.

చిరం : నాకు చిరంజీవిగా ఉండాలని లేదు. నేనూ వస్తున్నాను. జలాంతశ్చంద్రిచపలకోసం నేను నిర్జీవిని కాదలచుకున్నాను.



# మరో ప్రపంచం

ప్రకటన: ఈ నాటకం ఒక యువకవి మెదడులో, అందలి సుప్త చైతన్య రంగంలో జరుగుతుంది. దీనిలో యువతీ యువకుల గొంతుకలూ, వృద్ధకంఠాలూ, ఇరవై ఒకటవ శతాబ్దపు మానవుని గొంతుకా పాల్గొంటాయి.

యువతీ యువకుల బృందగానం:

మరో ప్రపంచం,
మరో ప్రపంచం.
మరో ప్రపంచం పిలిచింది.
పదండి ముందుకు,
పదండి తోసుకు
పోదాం! పోదాం పైపైకి
కదం తొక్కుతూ,
పదం పాడుతూ,
హృదంతరాళం గర్జిస్తూ
పదండి పోదాం
వినబడలేదా
మరో ప్రపంచపు జలపాతం?

1వ గొంతుక : ఇదంతా ఏమో కలలా వుంది.

2వ గొంతుక : ఇదంతా ఏమిటో చీకటిగా వుంది.

1వ ,, : కాదు ఎంతో వెలుగ్గా వుంది.

2వ ,, : అంతా ఏమిటో కలలాగ మాత్రం -

1వ ,, : లేదు. కలలే నిజమవుతాయి.

3వ ,, : ఎవరో వస్తున్నారు.

2వ ,, : ఏదీ నాకేం కనబడలేదు.

1వ , : అదుగో అటు చూడు దూరంగా.

2వ ,, : ఏమిటో నాకంతా అగమ్యగోచరంగా వుంది.

1వ ,, : చూడు. దూరంలో మబ్బులాంటి పొగమంచు లాంటి పుప్పొడి మూరంలాంటి దుమారంలో

2వ గొంతుక : అదేంకాదు. అదంతా ఒక గందరగోళం.

3వ ,, : ఆ గజిబిజిలోంచే ఎవరో వస్తున్నారు.

2వ ,, : ఏమో వస్తున్నాది.

3వ .. : దాన్ని వర్ణించు.

2వ ,, : టెన్నిస్ బంతిలాగుంది.

1వ ,, : ఆకుపచ్చనిబంతి.

3వ ,, : ఆకుపచ్చని గాజుబంతి.

1వ ,, : అదంతా ఒక పెద్ద కన్నులాగుంది.

2వ ,, : కాదు. అంతా ఒక చెవి.

1వ ,, : అదే దాని నోరులాగ కూడా అగపడుతోంది.

2వ ,, : అదే దాని -

3వ ,, చాలించు దగ్గర పడుతున్నాడు.

1వ గొంతుక : ఏమో మాట్లాడబోతున్నాడు.

2వ గొంతుక : ఒళ్ళంతా ఒకే కన్ను చేసుకొని వీక్షగా చూస్తున్నాడు.

1వ గొం : ఎవరు నువ్వు కనుపాపా ?

కనుపాప : (లోహకంఠం - తెలివైన కుర్రాడు టెలిఫోన్‌లో మాట్లాడి నట్టు) - నేను ఇరవై ఒకటవ శతాబ్దపు మనిషిని.

2వ గొం : మనిషి, ఆకుపచ్చని గాజుబంతి, కనుపాప ?

1వ గొం : ఇది కలా, నిజమా ?

2వ గొం : నిజంగా నువ్వు మనిషివేనా ?

కనుపాప : మనిషినే. నిజమే. కాని ఏదో పెద్ద పొరపాటు జరిగింది. ఇప్పుడు నే నెక్కడున్నాను ?

1వ గొం : ఇది ఆలిండియా రేడియో, మద్రాసు కేంద్రం.

కనుపాప : ఊహుఁ, ఇది ఎవరిదో మెదడులాగుంది.

2వ గొం : దేవాంతకుడు.

1వ గొం : ఎలా తెలుసుకున్నాడో ?

కనుపాప : ఔను. ఇది రేడియో స్టూడియో కూడా. ఫోకస్ తగ్గించి చూస్తే కనిపించింది.

1వ గొం : నువ్వు మానవమాత్రుడివి కావు.

కనుపాప : నేను మానవుణ్ని నమ్మండి, నేను మనిషి నే.

2వ గొం : నిజంగా ?

కనుపాప : నిజంగా నిదర్శనం కావాలా ? మానవుడన్నవాడు పొరపాటు చేస్తాడు. నేను పొరపాటు చేశాను. భవిష్యత్తులోకి ప్రయాణం చెయ్యబోయి నా అంతర్యంత్రాలను అజాగ్రత్తగా కదల్చడంవల్ల. భూతకాలంలోకి వచ్చాను. ఇది ఇరవయ్యో శతాబ్దంలాగుందే ?.

1వ గొం : ఔను.

కనుపాప : అందుకే ఇంత ఉక్కిరిబిక్కిరిగా ఉంది. శీతోష్ణస్థితి మీ అధికారంకిందకి రాలేదని మేము చరిత్రలో తెలుసుకున్నాం. కాని ఇంత ఉక్కగా ఉంటుందనుకోలేదు. ఇక నేను పోతున్నాను.

1వ గొం : వద్దు, వద్దు. కనుపాపా ! పోవద్దు.

కనుపాప : లేదు. పోవాలి – కావలిస్తే మళ్ళీవస్తాను.

2వ గొం : అబద్ధం.

కనుపాప : అదేదో కొత్తమాట నాకు అర్థంకాలేదు.

2వ గొం : అయ్యో ! మీకు అబద్ధాలు తెలియవూ ?

కనుపాప : వేళ మించిపోతోంది. వెళ్ళొస్తాను.

1వ గొం : త్వరలో రావాలి.

కనుపాప: తప్పకుండా, ఇప్పుడే ఇరవై అయిదో శతాబ్దంలోకి వెళ్ళి వెంటనే వచ్చేస్తాను.

1వ గొం: వెళ్ళిపోయాడు.

2వ గొం: ఇదంతా నిజమా, కలా?

1వ గొం: నిజం నిజం భవిష్యత్తు కనబడింది మనకి. భావిమానవుణ్ని చూశాం మనం. అతనితో మాట్లాడాం. విచిత్రంకాదూ. కలలు నిజమవుతాయికాదూ.

యువతీ యువకులు: భవిష్యత్తుకి స్వాగతం. మానవుడికి స్వాగతం.

బృందగానం: మరో ప్రపంచం .... జలపాతం.

1వ వృద్ధకంఠం: మరో ప్రపంచం, మరేం పనిలేకపోతేసరి.

2వ వృ: ఏదీ, ఏదీ, ఆ మరో ప్రపంచం?

1వ వృ: ఎక్కడ?

2వ వృ: ఎప్పుడు?

1వ వృ: ఏమిటో ఆ ప్రపంచం? ఎలావుంటుందో అది?

ఒక గద్గదకంఠం: జీవు లెనుబదినాల్గు లక్షలు
చావు పుట్టుక లిక్కడా
ఎవరు చేసిన పాపకర్మము
లనుభవించే దక్కడా....

అదీ మరో ప్రపంచం.

ఒక వృద్ధ: మరో ప్రపంచం అంటే మరణం.

ఇంకో వృద్ధ: మహా ప్రస్థానం అంటే మరణం.
ఫేడ్ ఇన్....(పుట్టినబిడ్డ ఏడ్చిన చప్పుడు)

ఒక యువకంఠం-స్త్రీ: మరో ప్రపంచం అంటే జననం సృష్టి! ఈలోకం ఇహలోకం, ఇప్పుడే, ఇక్కడే.

బృందగానం: దారిపొడుగునా గుండె నెత్తురులు
తర్పణచేస్తూ పదండి ముందుకు
బాటలు నడిచీ, పేటలు కడచీ
కోటలన్నిటిని దాటండి.

నదీ నదాలూ. అడవులు, కొండలు,
ఎడారులా మన కడ్డంకి?

(పై చరణం పాడుతున్నంతసేపూ, తగ్గుస్థాయిలో వినబడుతున్న శిశువు ఏడుపుపాట ఆగగానే స్థాయి హెచ్చుతుంది.)

ఒక యువకంఠం: అదే ప్రపంచభాష. భవిష్యత్తుపాట. సార్వకాలిక సార్వ సానికమైన మానవుని భాష.

2 వ ,, : భవిష్యత్తుకి స్వాగతం.

3 వ ,, : మరణంలేని మానవాత్మకి స్వాగతం.

గద్గద కంఠం: ఏమి జన్మము, ఏమి జీవనము
ఈ మాయకాయము
ఏమి శాశ్వత మేమి—
(ఆ పాటను ఉప్పెనగా ముంచివేస్తూ)

బృందగానం: పదండి ముందుకు
పదండి తోసుకు
పోదాం, పోదాం పైపైకి
ఎముకలు కుళ్ళిన వయస్సు మళ్ళిన
సోమరులారా చావండి!
నెత్తురు మండే, శక్తులు నిండే
సైనికులారా రారండి!
హరోం హరోం హర, హర హర, హరహర
హరోం హరా అని కదలండి!
మరో ప్రపంచం, మహా ప్రపంచం
ధరిత్రినిండా నిండింది.

గద్గద: ఈ రోజుల్లో ఇదో పిచ్చి. ఏమిటో వీళ్ళందరికీ ఈ వెర్రిభ్రమ.
ఎన్నాళ్లు బతికినా ఏమి సామ్రాజ్యమే
కొన్నాళ్ళ కో రామచిలుకా
మూన్నాళ్ళ ముచ్చటకే మురిసేవు తుళ్ళేవు
ముందుగతి కానవే చిలుకా.

1వ యువకంఠం : ఎవరీ మృత్యుమాత ? ఏమిటా ఏడుపుకూత ? మనుష్యులు మరణిస్తారు. మానవునికి మరణం లేదు.

2వ ,, : భవిష్యత్తుకి స్వాగతం.

3వ ,, : మానవునికి స్వాగతం.

బృందగానం : పదండి ముందుకు
పదండి తోసుకు
ప్రభంజనం వలె హోరెత్తండి
భావవేగమున ప్రసరించండి.
వర్షుకాభ్రముల ప్రళయఘోషవలె
పెళ పెళ పెళ ఫెళ విరుచుకు పడండి
పదండి, పదండి, పదండి ముందుకు
కనపడలేదా మరోప్రపంచపు
కణ కణ మండే త్రేతాగ్ని

గద్గద : ఇంకా తగలెట్టండి. ఇప్పటికే మండుకు పోతోంది కాలం. ఏమిటో ఆ మరోప్రపంచం ?

ఒక ఎగతాళి గొంతుక : ఎలా వుంటుందో అది ?

ఇంకొక ఎగతాళి గొంతుక : ఎక్కడ దొరుకుతుందో ?

1వ ఎగతాళి గొంతుక : ఏమిటీ చెప్మా దానికి దారి ?

2వ ,, : వోట్లు ఇవ్వడమూ ?

3వ , : యోగాభ్యాసమూ ?

2వ ,, : పారిశ్రామికాభ్యుదయమూ ?

గద్గదకంఠం ; పరస్పర సంహారమూ ?

1వ ఎగతాళి గొంతుక : భాషనుండి కొన్ని పదాలను శాశ్వతంగా తొలగించడంవల్ల కాబోలు.

3వ ఎగతాళి గొంతుక : భూలోకమునుండి కొన్ని జాతులను పూర్తిగా తుడిచిపెట్టడంవల్ల కాబోలు.

2వ ఎగతాళి గొంతుక : శబ్ద విస్తరణ యంత్రాలు పెట్టి ఏవో ఒక పతాకం పాతి, వేనవేల జనంముందు ఘాటుగా ఉపన్యసిస్తే :

ఉపన్యాసం : సోదర సోదరీమణులారా, నేడు చాలా సుదినం. ఇంకొకచోటికి పోకుండా, ఇక్కడకే వచ్చినందుకు మిమ్మల్నీ, మిమ్మందర్నీ ఆకర్షించగలిగినందుకు నన్నూ చాలా అభినందించుకొంటున్నాను. నూతన జీవితకాంతులు మీమీద ప్రసరించడం ప్రారంభమవుతోంది. నేను చూపించిన మార్గంలోనే మీరంతా నడవండి. కనుచూపుమేరలో అదిగో మన గమ్యస్థానం కనబడుతోంది. ఈ మాట మీకు ఇరవైయేళ్ళ క్రిందటే చెప్పాను. చూశారా, నేటికి నిజం ఋజువయింది. (కరతాళధ్వనులు)

2వ ఎగతాళి గొంతుక : ఇక్కడ భూలోకస్వర్గాలు విక్రయించబడును. వెంటనే కొనుక్కోండి. వెల స్వల్పం. ఫల మధికం.

2వ ఎగతాళి గొంతుక : నకలు సరుకుచూసి మోసపోకండి. "మహో ప్రపంచం" మార్కు గుర్తించుకోండి. భవిష్యత్తును పొట్లాలుకట్టి పంచభాషల చీటీలతో సహా పంచిపెడుతున్నాము. ఎండకాలపు తగ్గింపు ధరలు.

యువకంఠం : ఆహా, ఈ పెద్దమనుషు లెవరో కాని, తమ వెటకారంలోనే మా కొక గుణపాఠం బయలు పెడుతున్నారు. అమ్మడం, కొనడం తప్ప. ఇంకో విధంగా వీళ్ళ మనస్సులు ఆలోచించనేలేవని స్పష్టం చేస్తున్నారు. రూపాయణాపైసలు లేని లోకంలో, వీరి కూపిరి సలపదు కాబోలు.

ఇంకొక : ఔను పాపం. నేటి జీవితపు ఉష్ణోగ్రతని కొలవడానికి ధర్మామీటరు ధనం. ఈ లోకంలో అన్నీ అమ్ముడుపోతూనేవున్నాయి. చదువు, సౌందర్యం. కళ, సాహిత్యం. శాస్త్రం. శ్రమ – అన్నీ. ప్రయాణం, పెళ్ళి, యుద్ధం – ఏది చెయ్యాలన్నా డబ్బే ప్రధానం.

మొదటి : నీరయితే నిమ్నానికి ప్రవహిస్తుంది కాని, ధనంమాత్రం ఉన్నత క్షేత్రాలకి తప్ప, ఇంకో చోటికి పారదు. ధనస్వాములవారి హయాంలో ప్రజల బాధలగుణకారం జరిగినంత జోరుగా, బ్యాంకుల్లో అంకెలు పెరిగిపోతాయి. ఆవశ్యక వస్తువులు చీకట్లో అదృశ్యమవుతాయి. సంఘద్రోహులు ప్రజల బ్రతుకులను పణంగా పెట్టి జూదం సాగిస్తారు.

2వ యువ : ఇదీ మన ప్రపంచం? ధనస్వామిని రక్షించడానికి న్యాయవాదుల శక్తి యుక్తులూ, రాజకీయవాదుల నక్కజిత్తులూ, విజ్ఞానవేత్తల తెలివితేటలూ, అన్నివేళలా పారా ఇస్తాయి. ఈ లోకం నుంచి ఎగిరిపోయి శిరోవేష్టనం ధరించిన ఏ వైమానికుడూ, దూరదర్శినీ యంత్రంతో విహాయసంనుంచి విహంగావలోకనం చేస్తూ, ప్రతీ ఒక్క చదరపుమైలుకీ సగటు సంఖ్యని ఎంతమంది నిర్భాగ్యులున్నారో ఎన్నడూ లెక్క కట్టబోడు.

3వ యువ : ఇదీ మన ప్రపంచం? ప్రజలలో నిస్పృహ పరిపక్వ మవుతున్న కొద్దీ, జీవితంమీద విరక్తి జనిస్తుంది. పిల్లల్ని పోషించలేని పెద్దమనిషి పెళ్ళాన్ని తిడతాడు, కొడతాడు. అనుదినం అనంతంగా ఒకే అభినయం చేసే ట్రాఫిక్ పోలీసువాడు అమాంతంగా ఏకాంతంలోకి పోయి, ఎవరితోనూ చెప్పకుండా విషం తాగేస్తాడు. జీవితంలో నీరసం దారుణ మవుతున్నకొద్దీ, మనుష్యులకి మతులు చెడిపోయి కాళ్ళమీద నిలబడి కళ్ళతో అరుస్తారు.

మొదటి యువ : ఇదీ మన ప్రపంచం. విప్లవ పద్ధతులలో తరిబీయతిచ్చే విశ్వ విద్యాలయాలు లేకపోవడంవల్ల, విద్యార్థులు పరీక్షాపత్రాలని ప్యాస్ మార్కుల ద్వీపానికి తీసుకుబోయే పడవలుగా మాత్రమే పరిగణిస్తారు. వాళ్ళ అధ్యాపకులు సహా, మధ్య తరగతుల మర్యాదలకు కట్టుబడి, నిన్నటి అబద్ధాలనే నేటికూడా సరఫరా చేస్తూ, తలలోని తెలివీ తలపైని వెంట్రుకలూ కోల్పోయి, ముప్ఫై యేళ్ళకే ముసలివాళ్ళయి పోతారు.

2వ యువ : ఆపాదమస్తకం రుజాగ్రస్తమైన ఈ ప్రపంచంలో సర్వవేళలా సమాజానికి అంతఃకరణలుగా పనిచేయవలసిన కవులు సైతం, సామాజిక శరీరంలో బ్రహ్మరంధ్రం దాకా పర్యాప్తమయ్యే సుషుమ్నానాడిగా స్పందించవలసిన కవులు కూడా, స్తంభించిపోతారు. గంతలుకట్టిన గానుగెద్దుల్లాగ లాగలేనంత బరువు భరించే ఛందస్సులచేత సర్కస్‌ఫీట్లు చేయిస్తూ, అర్థాన్ని మొయ్యలేక అలసిపోయిన మాటలు చేసే మూకసంజ్ఞలకి మూర్ఛపోతారు.

3వ యువ : ఇదీ మన ప్రపంచం. ఇక్కడ ఈ పరస్పర విద్వేషాగ్నుల మధ్య ముంచుకొచ్చే మృత్యువాంఛల నడుమ, నిరాశాంధకారాల నీడలకింద రకరకాల కుహనా ప్రవక్తలు బయలుదేరుతారు. జీవిత సంగ్రామంలో అన్ని రంగాలలోనూ పరాజయంపొందిన భ్రష్ట ప్రాణులంతా, వీళ్ళచుట్టూ భజనచేసి పారలౌకిక మీమాంసల్లోకి పలాయన మవుతారు. ఈ విపన్నజీవుల ఐహిక సమస్యల్ని ఆముష్మికంగా భీమా చెయ్యడానికి భగవంతుని ఏజంట్లమంటూ ప్రచారం సాగించే పేరు పేరు వరసల దంభసన్యాసులు పెచ్చుపెరిగి పోతారు.

ఒక వృద్ధ : చాలు ఇక చాలు. చాలించండి. మీ ధోరణి. అయినా ఈ కాలపు కుర్రకారంతా ఇలా తయారవుతూందేమిటి ? పెద్దలమీద గౌరవం లేనేలేదుకదా, సంప్రదాయాలమీద భక్తి సన్నగిల్లి పోయింది కదా. రాజభక్తిమాట సరే దేశభక్తికూడా లేదు. నానాటికీ వీళ్ళలో నాస్తికభావాలు మాత్రం ముదిరిపోతున్నాయి.

ఇంకో వృద్ధ : ఇదంతా వొట్టి కుర్రతనపు విరగబాటు. అనుభవంవల్ల సవరించబడని ఉద్రేకంచేసే అతివాద విమర్శ-కాలం గడిచి కష్టాలు వొంటబట్టిన తర్వాత వీళ్ళకే తెలుస్తుంది. ఈ జబ్బులన్నీ వర్తమానకాలపు ప్రత్యేకలక్షణాలు కావని; ఇవన్నీ మన రోజులు ఎప్పుడూ ఉంటాయని; ఎందరు ప్రయత్నించినా వీటిని కుదర్చడం ఎన్నటికీ సాధ్యం కాదని.

ఒక వృద్ధ : అసలు సమాజమనేదే మిథ్య - ఒక్కొక్క వ్యక్తి తన శరీరం అనే కారాగృహంలో ఒక్కొక్క ఖైదీ. శిక్ష అనుభవిస్తూ చివరికి మృత్యువులో విడుదలకి ఎదురుచూడడం తప్ప, మానవుడు చెయ్య గలిగింది మరొక టేదీ లేదు.

2వ వృద్ధ : ఆద్యంత రహితమైన విశ్వంలో జననమరణాల శాఖా చంక్ర మణంచేసే మానవమాత్రుడి కొక ప్రాముఖ్యం ఇవ్వడం అనవసరం. సూర్యుడిలోంచి మంటబంతిగా విడిపోయిన భూగోళంమీద మానవుడు లేనికాలం ఒకటుంది. సూర్యుడు చల్లారిపోయి మంచుముద్దగా

పేరుకుపోయే భూలోకంనుంచి మానవుడు నిష్క్రమిస్తే, సృష్టి దృష్టిలో అదొక నిట్టూర్పు విడువదగ్గ విషాద సంఘటన కానేరదు.

ఒక యువ : ఈ నిరాశావాదంతో మాకు నిమిత్తంలేదు. జీవితానికి పరాజయం ఉందని మేము అంగీకరించలేము. భూమిమీద కాకపోతే, ఇంకో ఖగోళంలో ప్రాణం పుష్పిస్తుంది. మానవుడిలో మాకు నమ్మకం ఉంది. భవిష్యత్తులో మాకు విశ్వాసం ఉంది.

ఒక వృ : కాలం అనేదే ఒక భ్రాంతి. కాబట్టి భవిష్యత్తులో నమ్మకం భ్రాంతిలో భ్రాంతి.

యువ కం : భవిష్యత్తుని మేం చూశాం. భావి మానవుడు మాకు కనిపించాడు.

2వ వృ : వ్యర్ధస్వప్నాలు అంతా మిధ్య. మృత్యు వొక్కటే యథార్థం.

ఒక యు :- సరే మీరు గతకాలాన్ని నెమరు వేసుకుంటూ మృత్యువునే ఆరాధించుకోండి. వెనక్కి వెనక్కి వెళ్ళిపొండి.

గద్గద కం : అలానే వెళ్ళిపోతాం, వెనక్కి కాకపోతే మాకు భవిష్యత్తులో ఏముంది కనుక ?

ఏయ్ టాక్సీ, వెనక్కి ఇంకా వెనక్కి
గోడ కనబడలేదా పోదాం వెనక్కి
ఈ సందుకి మలుపు లేదు. పోపో వెనక్కి
హేహే టాక్సీ ఇలా తెచ్చావేం, ఇంక వెనక్కి
ఓయ్ నావికా. మళ్ళించు పడవ
ఈ నీళ్ళు ఎంతదూరం వెళ్ళినా ఇంతే
గాలి మారింది నావికా వెనక్కి తిప్పు పడవ
వ్యర్థం ఈ ప్రయాణం వెళ్ళిపోదాం వెనక్కి
అమ్మాయీ, జీవితం, అలిసిపోయాం మనం
నీ జుత్తు తెల్లబడింది నా ఆశ చల్లబడింది.
నా నాళాల్లో ప్రవహించేది నెత్తురు కాదు జావ.
అమ్మాయీ హడలిపోయాం వెనక్కి పట్టించు దోవ

సినిమా ఆపరేటర్ స్లోమోషన్ ఫ్లాష్‌బాక్
బద్ధలైన నా స్వప్నాల రంగు గాజుపెంకు లేవీ
చిదికిన నా యౌవనపు సీతాకోకచిలుక లేవీ
నా పారిపోయిన చిన్నతనపు పచ్చదనం ఏదీ
అమ్మాయీ జీవితం
ఆనందం, సౌందర్యం
ఘోరమైన దోపిడి జరిగింది.
పారిపోదాం వెనక్కి.

మేం వెళ్ళిపోతున్నాం అమ్మాయిలూ, అబ్బాయిలూ. ఇదిమాత్రం జ్ఞాపకం ఉంచుకోండి. మీమీద మాకు కోపం లేదు. యౌవనోత్సాహంవల్ల ఇంద్రధనస్సు రంగులతో ఏవో వింతలోకాలు చిత్రించుకుంటారు మీరు. అవి తామరాకులమీద నీటిబిందువుల్లాగ ఎంత అందమైనవో అంత అశాశ్వతమైనవి.

యువ కం : ఇకమీరు వెళ్ళండి. మాకుకూడా మీమీద కోపం లేదు. మీ దృక్పథాన్నే మేము సహించలేము. మీది వెనుక చూపు, మాది ముందుచూపు.

2వ యువ : భవిష్యత్తును చూశాం మేము. భావిమానవుడు కనిపించాడు మాకు. మళ్ళీ ఇప్పుడే వస్తాడు.

వృద్ధ : అర్థంలేని ఆశలు. ఆకారంలేని స్వప్నాలు.

యువ కం : భవిష్యత్తులో మాకు నమ్మకం|వుంది. మానవుడిలో మాకు విశ్వాసం ఉంది.

రాశిచక్ర గతులలో,
రాత్రిందివాల పరిణామాలలో,
బ్రహ్మాండ గోళాల పరిభ్రమణాలలో,
కల్పాంతాలకు పూర్వం కదలిక పొందిన
పరమాణువు సంకల్పంలో
ప్రభవం పొందినవాడా !

మానవుడా ! మానవుడా !
ఆలోచనలు పోయేవాడా !
అనునిత్యం అన్వేషించేవాడా !
చెట్టూ, చెరువూ
గట్టూ పుట్టా
ఆకసంలో, సముద్రంలో
అన్వేషించేవాడా !
అశాంతుడా ! పరాజయం ఎరుగనివాడా !
ఊర్ధ్వ దృష్టీ ! మహామహుడా !
మహా ప్రయాణికుడా !
మానవుడా ! మానవుడా !
అవిభక్త కుటుంబీ !
ఏకరక్త బంధూ !
మానవుడా ! మానవుడా !

యువకం : కనుపాప వస్తున్నాడు.

2వ యువ : ఔను. వస్తానని అన్నాడు. అలాగే వస్తున్నాడు. వాళ్ళ ప్రపంచంలో అసత్యానికి చోటులేదు.

వృద్ధ : కనుపాప ఎవరు ?

యువ : భావి మానవుడు. అదిగో వస్తున్నాడు.

వృద్ధ : మాకే కనుపాపలూ కనబడలేదు.

యువ : మీ కళ్ళు గతాన్ని తప్ప భావిని చూడం అని భీష్మించుకున్నాయి. మీకు కనుపాప ఎలా కనపడతాడు ?

వృద్ధ : అంతా భ్రాంతి. అంతా మిధ్య.

1వ యువ : అదుగో కనుపాప

2వ యువ : ఆకుపచ్చని గాజుబంతి.

3వ యువ : భావి మానవుడు.

కనుపాప : మాట నిలబెట్టుకోవడానికి వచ్చాను. అంతే ఈ వాతావరణంలో నేను ఉండలేకపోతున్నాను.

1వ యువ : మాకోసం కొంతసేపైనా ఉండాలి. కనుపాపా మీ కాలపు విశేషాలు చెప్పవూ ?

కనుపాప : అడగండి చెబుతాను.

1వ యువ : అంతా ఆశ్చర్యంగా వుంది. ఏం అడగాలో తోచలేదు.

2వ యువ : ఎన్నో అడగాలని ఉంది. ఏం అడగడానికీ తోచలేదు.

1వ యువ : కనుపాపా : మీకు మరణం ఉందా ?

కనుపాప : మేము కాలంలో జీవిస్తాము. కాలాన్ని అర్థం చేసుకున్న వాళ్ళకి మరణం లేదు.

2వ యువ : కనుపాపా మీకు ఆకలి వేస్తుందా ?

కను : ఆకలి ? ఆ మాటకి నా కర్థం తెలియదు.

2వ యువ : కాదు. మీకు ఆహారం అక్కర్లేదా ?

కను : ఓహో అదా ? ఈ సమస్యను చెట్లు ఎప్పుడో పరిష్కరించాయి.

2వ యువ : అందుకా ఆ ఆకుపచ్చదనం ? సూర్యకిరణాలనే మీరు తింటు న్నారన్నమాట.

కను : కిరణాలని తినం. వాటి శక్తిని పీల్చుకొని –

1వ కం : సరే. ఈ ఏండి ఘోషకేంగాని, ఒక సంగతి చెబుమా. నువ్వి ప్పుడు తెలుగు భాష మాట్లాడుతున్నావు. మీ రంతా ఇదే భాష మాట్లాడుతారా ?

కను : మే మసలు మాట్లాడుకోము. భాష చాలా అసమగ్రమైన పనిముట్టు. ఏ ఊహనీ అది విస్పష్టంగా అసందిగ్ధంగా తెలియజెయ్యలేదు. నా మాటలుకూడా మీకు సరిగా అర్థమవుతున్నాయో లేదో తెలియదు.

ఇరవయ్యో శతాబ్దంలో తెలుగు జనులమధ్య ఉన్నాను. కాబట్టి నా ఊహాయంత్రాలు తెలుగు ధ్వనులు చేస్తున్నాయి.

1వ కం : అయితే మీరు ఒకరి భావాలు మరొకరి కెలా ప్రకటించు కుంటారు ?

కను ; పరస్పరం ఊహలతోనే ప్రసంగించుకొంటాము. ఈ సమస్యను కూడా చెట్లే పరిష్కరించాయి.

2వ కం : నువ్వు చెట్టువా ?

కను : కాను. అయితే వృక్షాలతత్వం మాలో చాలామటుకు జీర్ణించింది.

1వ కం : అదెలాగ ?

కను : వినండి. ఇరవై ఒకటవ శతాబ్దపు తొలి సంవత్సరాలలో రెండవ పరమాణు యుద్ధం జరిగింది. అందులో–

1వ కం : మొదటి పరమాణుయుద్ధం ఎప్పుడు జరిగింది ?

కను : ఇరవయ్యో శతాబ్దంలో. అంతకన్న ఎక్కువ నన్నడగవద్దు.

2వ కం : పోనీ అది యెవరి మధ్య జరిగింది ? ఎలా పరిణమించింది ?

కను : రెండు విభిన్న దృక్పథాలుగల ప్రపంచరాజ్యాల మధ్య జరిగింది. 48 గంటలయుద్ధం అని దానికి చరిత్రలో పేరు. దాని ఫలితంగా రెండు రాజ్యాలూ తుడిచిపెట్టుకుపోయాయి. భూమి అంతా ఒక ఎడారిగా – ఇంతకన్న మంచిమాట నాకు దొరకలేదు – భూమి ఒక ఎడారిగా మారింది. లోకం మొత్తం మీద కొన్ని వందలమంది మనుష్యులూ, కొన్నివేల చెట్లూ మాత్రమే మిగిలాయి. చెట్లకి మనుష్యులకి మధ్యస్థంగా గోళాకారంగల జీవులు కొత్తగా ఆవిర్భవించారు. వాళ్ళ సంతతివాళ్ళమే మేము. రెండో పరమాణుయుద్ధం జరిగినదాకా ప్రాణికోటి పరిణామంలో జంతుతత్వం, వృక్షతత్వం విడివిడిగానే అభివృద్ధి చెందుతూ వచ్చాయి. గోళాకారులలో సంఘర్షణ క్రమక్రమంగా తీవ్రరూపం ధరించింది. నిజానికి

ద్వితీయ పరమాణు సంగ్రామం మానవునిలో జంతుతత్వానికీ, వృక్ష తత్వానికీ మధ్య జరిగిన యుద్ధం. అందులో కూడా ఏ తత్వమూ జయించలేదు. ఒక కొత్త పరిణామం మాత్రమే జరిగింది. దాని ఫలితమే మేము.

1వ యువ : కనుపాపా, 25వ శతాబ్దంలోకి వెళ్ళే నన్నావు. అప్పటి విశేషాలు చెప్పవూ ?

కను : నా కవి సరిగా బోధపడలేదు. మేము ఎనమండుగురం కలిసి పరిశోధనకని బయలుదేరాం. నా యంత్రాలలో పొరపాటువల్ల ఇటు వచ్చేశాను, నేను మళ్ళీ వెళ్ళిపోవాలి. సమిష్టిమీద పరిశోధన సాగిస్తున్నాం. సమిష్టిమీదనే మాకు అర్థం అవుతుంది. ఇక నన్ను బలవంతం చెయ్యకండి. నాకు వ్యవధి లేదు.

1వ యువ : ఒక్కటిమాత్రం చెప్పు కనుపాపా. మీలో ఎవ్వరికీ వ్యక్తిత్వం లేదూ ?

కను : ఏం ప్రశ్న యిది. సమిష్టి బాధ్యతలో వ్యక్తిత్వం ఎన్నడూ హరించుకుపోనక్కరలేదు. నే నున్నానా ? సమగ్ర సమాజజీవితంలో నా వ్యక్తిత్వం సంపూర్ణంగా వికసిస్తుంది. వ్యక్తిత్వం అంటే ఏకాంతం అనుకుంటారు మీరు. కాబట్టే మీ కందరికీ ఇంత ఒంటరితనం.

1వ యువ : మరి మీకు రహస్యాలు లేవూ ?

కను : రహస్యాలా ? మేము గోళాకారపు గాజు గృహాల్లో జీవిస్తాము. భూమి ఆకారంతో, విశ్వం ఆకారంతో, మా శరీరాలనీ, నివాసాలనీ సమన్వయించుకున్నాం. ఏ క్షణంలో ఎక్కడ ఎవ రేం జేస్తున్నదీ ఇంకొకళ్ళకి ఎప్పుడూ తెలుస్తూనే ఉంటుంది. ఆః వస్తున్నాను.

1వ యువ : వెళ్ళిపోయాడు.

2వ యువ : భవిష్యత్తు ఆకర్షణీయంగా లేదూ ?

వృద్ధ : అంతా పెద్ద భ్రమ. అంతా వొట్టి కల.
1వ యువ : తాతా, నువ్వు భావిమానవుడి మాటలు వినలేవా ?
వృద్ధ : నేను నిద్రపోతున్నాను. మీరు కలలు కంటున్నారు.
1వ యువ : కలలే నిజమవుతాయి. భవిష్యత్తును మేం చూశాం.
భావి మానవునితో మేం మాట్లాడాం.

బృందం : మరో ప్రపంచం....

కనపడలేదా మరో ప్రపంచపు
కణకణ మండే త్రేతాగ్ని.



142

శ్రీ శ్రీ * రేడియో నాటికలు * వెల : 2.00

# మా నూతన ప్రచురణలు

**Check List**

| | | | |
|---|---|---|---|
| Book Number | AA01B228 | Date | 24-9-21 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, 140, 141 | | |
| Missing Pages | NO | | |
| Prepared | Mounika | Scanned | Ch. Ramya |
| BOOK SIZE | H 7.1 W 4.8 | Pages | 146 |

